# ఫా జా రి బి

మూలం :

శరత్ బాబు

అనువాదం :

నీలకంఠం

# పూ జా రి ణి

## ప్రథమాంకము - ప్రథమ దృశ్యము.

[పగలు మూడవజాము. చండీగడ గ్రామములో ఒక సంకీర్ణ వీథి. అప్పుడే చండీగడ గ్రామ వీధుల్లో అరుణ కాంతులు ప్రతిఫలిస్తుంటయ్. ఆ సమీపంలోనే బీజగ్రామ జమీందారు కచేరీద్వారం సగం కనిపిస్తుంటుంది. ఆ దారంట యిద్దరు బాటసారులు తొందర తొందరగా వెళుతుంటారు. వారివెనక ఒకరైతు పొలములో పనిముగించుకుని యింటికి వెడుతుంటాడు. అతని యెడమ భుజంమీద నాగలి, కుడి చేతిలో చెంద్రకోల వుంటుంది. అతను తనకు ముందుగా వెడుతున్న ఎద్దుల్ని అదలిస్తూ అంటాడు. 'రామూ? సరిగ్గా పద నాయనా, సరిగ్గాపద లక్ష్మణ్, యిటూ-యిటుతిరుగు. మళ్ళీ నువ్వు పరాయివారి చెట్లు చేమల్ని పొట్టనపెట్టు కుంటావా?

కచేరి పెద్దగుమాస్తా నందీశుడు మెల్ల మెల్లగా ప్రవేశి స్తాడు. అతనిలో ఏదో ఉత్కంఠ, ఆశంక తొణికిసలాడుతూ వుంటుంది. ఒకవైపుకు ముఖంపెట్టి దేనినో వెదకుతున్నట్లు చూస్తుంటాడు. అతనికి వెనక వీధిలోంచి విశ్వంభరనాథ్ తొందర తొందరగా ప్రవేశిస్తాడు. అతను కచేరిలో పెద్ద బంట్రోతు, తహశీలు వసూలుకు వెళ్ళాడు. బీజగ్రామ జమీందారు జీవానంద చౌదరి చండీగఢం వస్తున్నాడని అత

నికి అకస్మాత్తుగా కబురు వచ్చింది. రెండుకోసుల దూరంలో ఆయన పాలకీవాళ్ళు విశ్రాంతి తీసుకుంటున్నారు. ఇకవస్తారు.]

విశ్వంబరుడు:– నందిబాబూ! ఏమి టలా నిల్చుని చూస్తున్నావు? ప్రభువుగారు విచ్చేస్తున్నారు.

నందీశుడు:– [త్రుళ్ళిపడి ముఖం త్రిప్పుతాడు. ఈ దుఃఖసంవాధం గంటక్రితమే అతనికి తెలిసింది. అతను ఉదాసీన కంఠంతో] ఊఁ!

విశ్వ:– ఊఁ ఏమిటండీ! అవతల బాబుగారు వచ్చేస్తుంటే.

నంది:– [వికృతమైన స్వరంతో] వస్తే నే నేమిచేయను? కబురులేదు. ఏమీలేదు. ప్రభువుగారు వచ్చేస్తున్నారు! ప్రభువుగారైతేమాత్రం తల త్రుంచేస్తారా?

విశ్వ:– [ఈ ఆకస్మిక వుద్రేకానికి కారణం తెలియక క్షణం సేపు మెదలకుండావుండి] అరె! నీప్రాణం అరచేతిలో పెట్టుకున్నావా?

నంది:– ప్రాణం అరచేతిలో ఎందుకు పెట్టుకోవాలి? మామగారి ఆస్తి దొరికితే, తండ్రి సంపాదించిన ఆస్తినిఎవరూ అనరు. విశ్వంబర్, నీకు తెలుసుగా! కాళీమోహన బాబు వీరిని యింట్లోకి రానిచ్చేవారుకాదు. పుత్రులు లేకపోవడం, ఆయన హఠాత్తుగా చావడం, వీరు జమీందారైపోవడం జరిగింది. లేకుంటే ఎక్కడ వుండేవాడో, నాకు తెలుసు!

విశ్వ:– తెలుసుకున్నందువల్ల లాభమేమిటో చెప్పు? వీరు మామగారి కొడుకు కాదు, అల్లుడుగారు. ఒకవేళ యీమాటలు వారు వింటే, ఇంట్లో దీపంపెట్టేవాళ్ళనుకూడా

మిగల్చకుండా తుపాకీగుండ్లకు ఎరచేసిపారేస్తారు. ఈ మధ్య ఎంతోమందిని కాల్చిపారేశారు. ఆయనముందు ఎవరూ నోరెత్తి మాట్లాడరు.

నంది:- అవును. మాట్లాడరు!

విశ్వ:- అరే! త్రాగుబోతుకు స్పృహ వుంటుందా? దయా ధర్మం వుంటుందా? పిస్తోలు-తుపాకి, కత్తిలేనిదే ఒక్క అడుగైనా బయటపెట్టడు. ఒకవేళ కాల్చిపారేసినట్లయితే ఏంచేస్తావో చెప్పు?

నంది:- ఆనాడు నువ్వుకూడా రాజభవనానికి వెళ్ళావు. ఆయన్ను చూశావా?

విశ్వ:- లేదు. సరిగ్గా చూడలేదు. అయినా చూశాననుకో! ఆ మీసాలూ, ముందుకు పొడుచుకుని వచ్చిన ఆ రొమ్మూ, ఆ గిరజాలు, ఎర్రని జపాపుష్పాలవంటి కళ్ళూ, సారాబట్టీలోంచి వచ్చే 'బాంయ్' మనే కంఠధ్వని...!

నంది:- విశ్వంబర్! అయితే పారిపోదాం పద!

విశ్వ:- అరే! పారిపోయి ఆయనకు కనుపించకుండా ఎంత కాలం దాక్కుంటాము నందిబాబూ! జుట్టుపట్టుకుని లాక్కొచ్చి, భూమిలో పాతేస్తాడు.

నంది:- అయితే ఏంచేదాం చెప్పు? ఈ త్రాగుబోతు శాంతి కుంజంలో వుంటానంటే ఏంకాను?

విశ్వ:- అలాంటిపనులు చేయవద్దూ-వద్దూ వద్దని ఎన్నిమార్లు చెప్పాను. ప్రతిసంవత్సరం శాంతికుంజం మరమ్మతులని ఖాతాకు వ్రాస్తూనే వున్నావు. నామాటవిన్నావా?

నంది:- నువ్వూ కచేరీలో గుమస్తావేగా...నువ్వుకూడా...

విశ్వ:- చూడూ! అటువంటి వెధవమాటలే అనవద్దంటున్నాను. నామీదికి నేరం నెట్టివేయడానికి చూడకు. అరే, అదుగో పల్లకి-!

[నేపథ్యంలో పల్లకీవాళ్ళ కంఠధ్వని వినిపిస్తుంది. విశ్వంబరుడు పారిపోవడానికి సిద్ధంగా వున్న నందీశుని చేయి పట్టుకుంటాడు. చేయివిడిపించుకోవడానికి పెనగులాడుతూ అంటాడు.]

నంది: చేయి వదులు దుర్మార్గుడా-!

విశ్వ:- [గొంతు స్థాయితగ్గించి] ఎక్కడికి పారిపోతావు? ఒక వేళ పట్టుకున్నాడంటే తుపాకీతో కాల్చిచంపుతాడు.

[పల్లకి దగ్గరకు వస్తుంది. ఇద్దరూ స్థిరంగా నిలుచుంటారు. పల్లకి లోపల జీవానందచౌదరి కూచునివుంటాడు. అతను తన ముఖాన్ని కొంచెం బయటకుపెట్టి అంటాడు]

జీవానందుడు:- ఈ గ్రామంలో జమీందారు కచేరీ ఎక్కడుందో మీకు తెలుసా?

నంది:- [చేతులు జోడించి] ఈ గ్రామమంతా ప్రభువుల వారిదే!

జీవా:- నేను గ్రామంసంగతి అడగడంలేదు. కచ్చేరి ఎక్కడుందని అడుగుతున్నాను.

నంది:- తెలుసు ప్రభూ! అదే!

జీవా:- మీరెవరు-?

[నందీశుడు-విశ్వంబరుడు యిద్దరూ వంగి నమస్కరించి, లేచి నిలుచుంటారు.]

నంది:— ప్రభువుల దాసుడు నందీశుడు.

జీవా:— ఓహో! నందీశుడంటే నువ్వేనా—? చండీగఢ సామ్రాజ్యానికి సర్వాధికారివి. కాని ఒకసంగతి విను నందీ. నీతో ఒకసంగతి చెబుతున్నాను. ముఖస్తుతంటే నేను అసహ్యించుకునేవాణ్ణికాదు. అది నిజమే! కాని, దానికీ ఒక హద్దంటూ వుండాలి. ఇదిమాత్రం మరిచిపోనద్దు నీ కచేరీతాళీళ్ళు వసూలు ఎంతవుంటుంది—?

నంది:— చిత్తం. చండీగఢపు ఆదాయం సుమారు అయిదు వేలుంటుంది.

జీవా:— అయిదువేలా ! సరే—! [బోయీలు పల్లకి దించుతారు. జీవానందుడు దిగడు. ఒక కాలు చాపి బయటకు పెట్టి సరిగా కూచుంటాడు.] మంచిది? నే నిక్కడ అయిదారురోజు లుంటాను. కాని, యీ మధ్యకాలంలో నాకు పదివేలు కావాలి. నందీ ! పున్నదయమే ప్రజలందరినీ కచేరీవద్ద హాజరుకమ్మని చాటించు.

నంది:— చిత్తం. ప్రభువుగారి ఆజ్ఞను వుల్లంఘించే వాడొక్కడూ వుండడు.

జీవా:— ఈ గ్రామములో మనకు ఎదురు నడిచేవా డెవడన్నా వున్నాడా ?

నంది:— లేరండి ! అయినా ఒక్క తారాదాసుచక్రవర్తి వున్నాడు. కాని, అతను మన ప్రజ కాడు.

జీవా:— ఎవ రా తారాదాసు—?

నంది:— చండీగఢ పూజారి.

జీవాః- రెండు సంవత్సరాల క్రితం నునకి విరుద్ధంగా, నా ప్రతి కక్షితరఫున సాక్ష్యం చెప్పింది యితనేగా-?

నందిః- [తలూపుతూ] చిత్తం ప్రభువులకు తెలియని విషయ మంటూ లేదు. అతనే యీ తారాదాసండి.

జీవాః- ఊ ! అప్పుడు చాలాడబ్బు ఖర్చుపెట్టించాడు. అతని వద్ద ఎంత భూమి ఉందేమిటి...?

నందిః- [మనసులో లెక్కగట్టి] అరవై డెబ్బది ఎకరాలకు తక్కువ వుండదు.

జీవాః- నువ్వివాళే అతన్ని పిలిపించి ఎకరాకు పదిరూపా యలు నజరానాగా చెల్లించమని చెప్పు.

నందిః- [సందేహంగా] చిత్తం ! కాని అది దేవాలయపు మాన్యమండి. దేవోత్తర సంపదండీ !

జీవాః- కాదు. దేవోత్తరసంపదపుూస్వత్వం యీ గ్రామములో ఒక్క ఎకరంకూడా లేదు. నజరానా లేకుంటే జప్తు చేయిస్తాను.

నందిః- ఇవాళే అతనికి కబురుచేస్తాను.

జీవాః- కబురుపంపటమేకాదు. డబ్బు రెండురోజుల్లో చెల్లిం చాలని చెప్పు.

నంది;- కాని, ప్రభూ-!

జీవాః- కానీ-గీనీ అలావుంచు నంద్ ! బారువీ నదివొడ్డున వుండే శాంతికుంజానికి సరాసరి యీ దారిన వెళ్ళ వచ్చునా ? మహావీర్, పల్లకి ఎత్తమని చెప్పు ! [వాహకులు పల్లకి ఎత్తుకుని వెళ్ళిపోతారు]

నంది:- అనుకున్నట్లే జరిగిందిరా విశ్వంబర్. ఈయన తిన్నగా వెళ్ళి శాంతికుంజంలో తిష్ట వేస్తున్నాడు.

విశ్వ:- లేకుంటే నీ కచేరీ పశువులదొడ్డిలో వుంటాడనుకున్నావా ?

నంది:- అక్కడికి వెళ్ళడానికి దారి వుందో-లేదో! తలుపులూ, కిటికీలు కూడా దొంగలు ఎత్తుకునిపోయారేమో! గదుల్లో సింహాలూ, ఎలుగ్గొడ్లూ వుండవచ్చుకూడా. అక్కడేంవుందో, ఏంలేదో నాకేమీ తెలవదురా విశ్వంబర్.

విశ్వ:- తలుపులూ, కిటికీల సంగతి నాకేం తెలుసు! నేను తమాషీలు పనూలుచేయడానికి సింహాలదగ్గరకూ, ఎలుగ్గొడ్లవద్దకు వెళ్ళలేదు.

నంది:- ఇప్పుడు యీ రాత్రికి దీపం ఎలాగు? మనుష్యులు ఎలా దొరుకుతారు? తిండితిప్పల ఏర్పాట్లు......!

విశ్వ:- ఈ దారిమీద కూచుని ఏడుస్తూవుండు. మనుష్యులు చుట్టూ గుమిగూడుతారు. దానితో తిండి-తిప్పల ఏర్పాట్లు —!

నంది:- నీకేం? నువ్వలాగే అంటావు దొంగవెధవా.

[ ప్రస్థానం ]

# రెండవ దృశ్యం

## శాంతికుంజం

[బాయియా వదివోడ్డున బీజగ్రామ జమీందారై స్వర్గీయ రాధామోహనబాబు కట్టించిన విలాసభవనమే శాంతికుంజం. మరమ్మతులు చేయకపోవడంవల్ల యివాళది అక్కడక్కడా పగిలి - శ్రీహీనంగా, ఏదో పాడుపడిన భవనంలా వుంది. దానిలో ఒకగదిలో ఒక సోఫామీద పక్క పరిచివుంది. దుప్పటి లేకపోవడంవల్ల విలువైన ఒక దుశ్శాలువ దానిమీద పర్చివుంది. తలవేపు ఒక గుండ్రని టేబిలువుంది. దానిమీద లావుపాటి తోలుబైండు పుస్తకం, దానిమీద సగం వెలిగి ఆరిపోయిన కొవ్వొత్తి వుంది. దానికి దగ్గరగా ఒక పిస్తోలుపడివుంది. దానిప్రక్కనే ఒక స్టూలుమీద, సోడా బుడ్డీ, సారాయితోనిండిన గ్లాసూ, సీసా వుంది. సారాసీసా సగం ఖాళీఅయిపోయింది. ఆ దగ్గరలోనే ఒక బంగారు అలి చిప్పవుంది. అది సిగరెట్టుబూడిద దులపడానికి వుపయోగ పడుతుంది. దానిమీద సగంకాలిన సిగరెట్టులోంచి యింకా పొగవస్తూనేవుంది. ఎదురుగావున్న గోడమీద రెండు నేపాళీ గూర్ఖాలు ధరించే కత్తులు వ్రేలాడుతున్నయ్! ఒకమూలలో తుపాకి ఒకటి గోడకానించివుంది. దానికి దగ్గర్లో ఒక నక్క శవం పడివుంటుంది. దాని శరీరంలోంచి వచ్చిన రక్తం ఎండి గడ్డకట్టివుంటుంది. ఖాళీ సారాసీసాలు చిందరవందరగా పడి వుంటాయ్! ఒకపళ్ళెంలో తినగా మిగిలన వస్తువు లేవో వున్నయ్. ఇంతవరకూ వాటిని శుభ్రపర్చలేదు. అక్కడే

మంచివిలువగల తుండుగుడ్డ చేతులు తుడుచుక్కుని, క్రింద పారేసివుంది. జీవానందుడు, సోఫామీద ఒకప్రక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు. కాళ్ళవేపున్న కిటికీచువ్వలు కొన్ని విరిగివున్నయ్! బయటినుంచి ఒక చెట్టుకొమ్మ లోపలికి పొడుచుకుని వచ్చింది. రెండు ప్రక్కలా రెండు తలుపులున్నయ్. ఒకతలుపు తెరుచుకుని, జీవానందుని సెక్రటరీ ప్రఫుల్లచంద్రుడు లోపలికి వస్తాడు.]

ప్రఫుల్ల:- ఆ మనిషి యిక్కడికికూడా వచ్చాడుబాబూ!

జీవా:- ఎవరతను?

ప్రఫుల్ల:- అదే మద్రాసువారి కర్మచారి. చెఱకుతోటకూ, పంచదార ఫ్యాక్టరీకి దక్షిణప్రాంతపు మైదానమంతా కొనాలనుకూస్తున్నాడే...అతనే. అయితే నిజంగా దాన్ని అమ్మేస్తారా?

జీవా:- తప్పకుండా! నాకు డబ్బు చాలా అవుసరం.

ప్రఫుల్ల:- కాని, చాలామంది రైతులు నాశనమైపోతారు.

జీవా:- నిజమే. కాని నేను రక్షింపబడతాను.

ప్రఫుల్ల:- ఇంకొక సజ్జనుడు బయట కూచునివున్నాడు. ఆయనపేరు జనార్ధనరాయలు. లోపలికి రమ్మనమని చెప్పమంటారా?

జీవా:- వద్దయ్యా వద్దు. ఇప్పటి కలా వుంచు. ఎప్పుడుబడితే అప్పుడు సాధుపురుషుల దర్శనం చేయకూడదు. అందుకు శాస్త్రాలు నిషేధిస్తున్నయ్.

ప్రఫుల్ల:- [నవ్వి] బాగా ధనవంతుడని విన్నాను.

జీవా:- ధనవంతుడే కాదు. గుణవంతుడు కూడాను. ఏ దస్త్రావేజులు కావాలన్నా, ఫోర్జరీ కావాలన్నా యిట్టే తయారుచేసి యిచ్చేస్తాడు. అంటే నకళ్ళు కాదు అనుకరణ కాదు. ఒక్కసారిగా క్రొత్తవి - అపూర్వమైనవి సృష్టించి యిస్తాడు. మహాపురుషుడు కదూ?

ప్రఫుల్ల: అటువంటివాడికి ఆశ్రయం యివ్వకండి!

జీవా:- అంత అవసరంలేదు. వీడు తన స్వంత ప్రతిభతో ఉచ్ఛస్థితికి పోవాలనుకుంటాడు. మనఆశ్రయం పొందలేడు.

ప్రఫుల్ల:- ఆ మైదానమంతా మనది కాదని విన్నాను. ఈ విషయంలో——!

జీవా;- కాదు ప్రఫుల్లా! ఈ విషయంలో నన్ను మాట్లాడనివ్వను. గొంతువరకు అప్పుల్లో మునిగివున్నాను. నీవు చెప్పే మంచిచెడ్డల భూతాన్ని తలమీద పెట్టుకుంటే పాతాళానికి అణిగిపోతాను. [ఒక గ్లాసు సారాయి త్రాగుతాడు] రసాతలానికి వెళ్ళడానికి యింకేమీ ఆలశ్యంలేదని నువ్వు ఆలోచిస్తునట్లున్నావు. నిజమే. ఆలస్యములేదని నే నెరుగుదును ప్రఫుల్లా! ఇంకొక విషయంకూడా నీకంటే నేను బాగా ఎరుగుదును. దీనికి దరిదాపంటూ లేదు. [ప్రఫుల్లుడు ఆయనముఖం చూస్తాడు] ఆఖరవుతున్న వస్తువును చూసి, అదింకా ఆఖరవుతుందనేసరికి నీవు కళ్ళంట నీళ్ళు కారుస్తావు. అదే నీలోని దౌర్బల్యం. సరేగాని, నువ్వెళ్ళి నందీశుని నాదగ్గరకు పంపు. ఇదిగో విను—నువ్వు పట్నంవెళ్ళి ఆ

మద్రాసువాడితో విషయం తేల్చుకునిరా ! ఏమం టావు ?

ప్రఫుల్ల:- [తలూపి] ఇంకా టైముంది. ఇవాళయినా వెళ్ళ వచ్చు. దొరగారిబండి వుందిగా !

జీవా:- సరే. ఆయనబండిలోనే వెళ్ళు.

[ప్రఫుల్లుడు వెళ్ళిపోతాడు. నందీశుడు ప్రవేశిస్తాడు.]

జీవా:- ఏం నందీ ! డబ్బు వసూలవుతుందా ?

నంది:- అవుతూంది ప్రభూ !

జీవా—తారాదాసు డబ్బు యిచ్చాడా ?

నంది:- ఒకపట్టున యివ్వడానికి వొప్పుకోలేదు. ఎంతో హడా విడిచేసి, చివరకు చెట్టుకుకట్టేసి చర్మం వొలిపిస్తాననే సరికి వొప్పుకుని యింటికివెళ్ళాడు. ఇవాళే యివ్వ వలసిన గడువురోజు.

జీవా:- తరువాత-?

నంది:- అతన్ని పట్టుకునిరమ్మని పల్లెవాళ్ళనిచ్చి మహావీరున్ని పంపించాను.

జీవా:- [సారాయిత్రాగి] మంచిపని చేశావు. మీ గ్రామ ములో విదేశీ సారాయిదుకాణం లేనట్లుంది. సరే, పరవాలేదు. నా దగ్గరున్నది యింకొకరోజుకు సరి పోతుందిలే. కాని మరొక విషయముంది నందీ ?

నంది:- చిత్తం. చెప్పండి!

జీవా:- విను నందీ ! నేను పెళ్ళి-అవును పెళ్ళిచేసుకోలేదు. బహుశా యిక ముందుకూడా చేసుకోనేమో! [కొంచం ఆగి] కాని, అంతమాత్రానికే నేను భీష్మ

దేవుడనై పోతాననుకోకు సుమీ! నువ్వు 'మహా భారతం' చదివేవా లేదా–? అందులోని భీష్ముని లాంటివాడిగా కూడా కాను. నేను శుకదేవునిగాకూడా వుండను. ఏమైనా అర్థమవుతోందా నందీ? ఆ... అదే నా కొకటి బాధ... తెలిసిందా–?

[నందీశ్వరుడు సిగ్గుతో తలవొంచుకుని తల వూగిస్తాడు.]

జీవా:- ఇలాంటి కబుర్లన్నీ నేను అందరితో వున్నదున్నట్టు చెప్పలేను. నాకు యిష్టంకూడా లేదు. అందువల్ల చాలా అనర్థాలు కలగవచ్చు. సరే, యిక వెళ్ళు.

నంది:- వెళ్ళి తారాదాసు సంగతేమిటో తెలుసుకుంటా నండీ! ఈమధ్యలో మనమీద ప్రజల్ని రెచ్చగొడ తాడేమో! [వెళ్ళబోతాడు]

జీవా:- ప్రజల్ని రెచ్చగొడతాడా? నే నుండగానే?

నంది:- అవును ప్రభూ! వీళ్ళు ఆ పనికూడా చేయగలరు.

జీవా:- నేను ఎరిగివున్నదల్లా ఒక్క తారాదాసునే! 'వాళ్ళు' అని అంటున్నావు. వాళ్ళెవరు?

నంది:- తారాదాసు కూతురు. భైరవి. తారాదాసంత చెడ్డ వాడుకాడు. ఇంతకూ మూలం ఆ పిల్లే! ఊళ్ళో ఉన్న రౌడీముఠా అంతా, ఆమె చెప్పుచేతుల్లోనే వుంది.

జీవా:- సరే! ఆమెకు ఎంత వయసుంటుం దేమిటి?

[క్రమక్రమంగా గదిలో మసకచీకటి వ్యాపిస్తుంది.]

నంది:- ఇరవై అయిదు, ఇరవైఆరేండ్లు వుండవచ్చు. బాగా మోటు తేలిన సిపాయిలా వుంటుంది. ఆడవాళ్ళ కుండ వలసిన మార్దవం, సుకుమారత్వం లేదు. యుద్ధానికి పోయే యోధుని లాగుంటుంది. అందువల్ల గ్రామస్తు లంతా యీమె సాక్షాత్తు చండీదేవి అని అను కుంటారు.

జీవా:- [ఉత్సాహంతో - కుతూహలంతో సరిగ్గా కూచుంటాడు] ఏమంటున్నావు నందీ? అసలు భైరవి కథేమిటో కొంచెం వివరంగా చెప్పవోయ్ వింటాను.

నంది:- భైరవి అనేది ఎవరిపేరూకాదండి ప్రభూ? చండీదేవత సేవికకు మారు పేరు. ఇప్పుడున్న భైరవిపేరు షోడశి. ఈమెకు ముందున్నామె పేరు మాతంగిని. ఆ దేవి ఆదేశానుసారంగా, ఆమె సేవకులు పురుషులు వుండ కూడదు. స్త్రీలే వుండాలి.

జీవా:- అదా సంగతి? అలా ఎప్పుడూ నేను వినలేదే!

నంది:- వివాహమైనమూడవనాటి రాత్రినుంచీ భైరవి భర్తను ముట్టుకోకూడదని ఆ దేవి ఆదేశం. అందువల్ల ఎక్కడ నుంచో ఒక బీదపిల్లవాడ్ని పట్టుకొచ్చి, పెండ్లి చేస్తారు. ఆమరునాడు వాడికి కొంత డబ్బూ దస్కం యిచ్చి పంపించేస్తారు. తరువాత వాడి నీడకూడా కనుపించ కూడదు ఇది పూర్వకాలంనుంచీ వస్తున్న ఆచారం.

జీవా:- [నవ్వి] ఏమంటున్నావు నందీ? ఒక్కసారే దేశబహి ష్కారమా—? భైరవి అయితే మానవమాత్రురాలు

కాదూ—? రాత్రిపూట భర్తగారికి ఏకాంతంలో ఒక్క గ్లాసు సారాయి యివ్వడమూ, గరంగరం మసాలా వేసి వండిన మహాప్రసాదం తినిపించడం. ఈమాత్రం చేయకూడదా?

నంది:- [తలవూపుతూ] లేదు ప్రభూ! ఆ తల్లికి భైరవిగావుండే వారు భర్త నుముట్టుకోకూడదు. అంటే గ్రామములో యింకెవరూ మగవాళ్ళు లేరనికాదు. భైరవి మాతను చూశాను నేను. ఇప్పుడు షోడశినికూడా చూస్తున్నాను. అడుగడుక్కూ తమమీద, ప్రజలతో దావాలు వేయిస్తూవుంటుంది.

జీవా:—ఆడది గ్రామానికి పెత్తందారైందన్న మాట. ఇంతులో దోషమేమీలేదు. నందీ, కొంచెం దీపంవెలిగించ వోయ్.

నంది:— [మైనపువత్తి వెలిగించి] ఇక వెళ్ళమంటారా ప్రభూ?

జీవా:— సరే వెళ్ళు. కొంచెం ఆ పుస్తకాన్నిటు యిచ్చివెళ్లు.

నంది:— [పుస్తకంయిచ్చి నమస్కరించి వెళ్ళిపోతాడు]

జీవా:— [పడుకుని పుస్తకంమీదకు మనసుపోనిస్తాడు. కొంచెం సేపయాక బయట ఎవరిదో అడుగులధ్వని వినపడు తుంది.]

జీవా:— ఎవరది—?

సరదారు:— [షోడశితో ప్రవేశించి] తారాదాసు పారిపో యాడు ప్రభూ! ఆయన కూతుర్ని పట్టుకునివచ్చాము.

జీవా:- [పుస్తకం అవలపార వేసి, ఆతృతగా లేచికూచుని] ఎవరిని-? భైరవినా-? [కొంచెంసేపు ఆగి] మంచిపని చేశావు. సరే వెళ్ళు.

[సరదారు తన అనుచరులతో వెళ్ళిపోతాడు.]

జీవా:- ఇవాళ మీరు డబ్బియవలసిన గడువు. డబ్బు తెచ్చావా-? [షోడశి నోటంట మాటపెకలదు] తీసుకు రా లేదూ? ఎందుకని-?

షోడశి:- మావద్ద డబ్బులేదు.

జీవా:- లేదంటే యీరాత్రంతా నువ్వు నా నౌకరులవద్ద బందీగా వుండాలి. దాని అర్థమేమిటో గ్రహించావా?

[షోడశి రెండుచేతులతో దర్వాజాకమ్ములను పట్టుకుని కళ్ళుమూసుకుని, తన మూర్ఛావస్థనుంచి తేరుకోవడానికి ప్రయత్నిస్తుంటుంది. ఆమె వివర్ణముఖాన్ని జీవానందుడు చూస్తాడు. ఒక్క నిముషంసేపు కర్తవ్యతావిమూఢుడైపోతాడు. ఆతరువాత దీపంతీసుకుని షోడశివద్దకు వస్తాడు. ఆ దీపాన్ని ఆమె ముఖానికి దగ్గరగావుంచి. ఆమె కాషాయ గుడ్డల్ని, చెదిరివున్న వెంట్రుకలనూ, దొండపండులాంటి పెదిమలనూ, బలిష్టమైన సరళ శరీరాన్నీ, అన్నిటినీ తనకళ్ళతో చూస్తుంటాడు.

జీవా:- [తిరిగివచ్చి దీపాన్ని యథాస్థానంలో వుంచి, సీసాలోంచి కొన్నిగ్లాసుల సారాయి వంపుకుని త్రాగి] నీపేరు షోడశికదూ-? [షోడశి మెదలకుండావుంటుంది] నీవయసెంత-? [జవాబురాదు. అందుకని కఠినంగా]

మొదలకుండా వున్నందువల్ల లాభంలేదు జవాబు చెప్పు–!

షోడశి:– [మృదుస్వరంతో] నాయను యిరవైఏనిమిదేళ్ళు

జీవా:– మంచిది. అదే నిజమైతే, పందొమ్మిది యిరవై ఏళ్ళనుంచీ నువ్వు భైరవితనం చేస్తున్నావు. అటువంటప్పుడు నువ్వెంతో డబ్బు కూడబెట్టివుంటావు మరి ఎందుకని యివ్వవు–?

షోడశి:– నావద్ద డబ్బులేదని ముందే విన్నవించాను.

జీవా:– లేకుంటే అందరూ ఎలాచేస్తున్నారో అలాగే చెయ్. డబ్బుగలవాడికి భూమి తాకట్టుపెట్టికానీ–అమ్మిగాని తీర్చవచ్చుగా!

షోడశి:– "భూమి నాంది కాబట్టి ఆ పని నాను చేయగలను. కాని, దేవమాన్యాలను దేవోత్తరసంపదను తాకట్టు పెట్టడానికిగానీ, అమ్మడానికిగాని నా కధికారంలేదు.

జీవా:– [హఠాత్తుగా నవ్వి] అదే పుచ్చుకోవ డానికి నాకధికారముందా ? నందికికూడా వసూలుచేసే అధికారం లేదు. అయినప్పటికీ వసూలుచేస్తున్నాము. ఎందుకు? నాకు అవుసరంవుంది గనుక. ఈ అవుసరమే ప్రపంచంలో అన్నిటికి మించినహక్కు. నీకైనా డబ్బు చెల్లించవలసిన అవసరంవున్నప్పుడు తప్పదు, అర్థమైందా ? [కొంచెమాగి] సరే. ఇది వదలిపెట్టు. ఇంత రాత్రప్పుడు వొంటరిగా యింటికి వెళ్ళగలవా? నిన్ను తీసుకునివచ్చినవారితో తిరిగి పంపడం నాకు యిష్టంలేదు.

షోడశి:- [వినయంతో] మీ అనుజ్ఞ యిచ్చినట్టయితే నేను వెళ్ళ గలను.

జీవా:- [ఆశ్చర్యంతో] ఒంటరిగా నే-! ఇంత కటికిచీకటిలో నీకు చాలా కష్టంకలుగుతుంది. [నవ్వుతాడు].

షోడశి:- లేదు, నేను వెళ్ళి తీరాలి.

జీవా:- [నవ్వుతూ] సరే డబ్బుయివ్వకుంటే మానేయ్ షోడశీ! అయినా- అనేక రకాలుగా...!

షోడశి:- మీ డబ్బూ, మీ తరహాలూ, మీకు శుభాన్ని కలుగచేస్తాయ్. నన్ను పోనివ్వండి.

[కొన్ని అడుగులు ముందుకు వేస్తుంది. కాని కొంత దూరంలో జమీందారుగారి సేవకులుండడం చూసి ఆగి పోతుంది.]

జీవా:- [ముఖం వికృతంగా చేసి, కఠిన స్వరంతో] నువ్వు సారాయి త్రాగుతావా?

షోడశి:- త్రాగను.

జీవా:- నీకు చాలామంది పురుష స్నేహితులున్నా రని విన్నాను. నిజమేనా ?

షోడశి:- [తలూపి] లేదు. అబద్ధం.

జీవా:- [కొంచెం సేపు మెదలకుండా వూరుకుని] నీ కంటె ముందున్న భైరవిలంతా సారాయి త్రాగడం నిజ మేనా? మాతంగి భైరవి చరిత్రమంచిది కాదు. అందుకు యింకా సాక్ష్యముంది నిజమా, అబద్ధమా?

షోడశి:- [సిగ్గుపడి మృదువుగా] నిజమేనని విన్నాను.

జీవా:– విన్నావా? సరే! మరి హఠాత్తుగా నువ్వు ఈపరంపరాగతాచారాన్నీ, గోత్రాన్నీ వదలి, ఎందుకు మంచి దాని వనపించుకోవాలనుకుంటున్నావు.? [సరిగ్గా కూచుని కఠోరంగా] అడవాళ్ళతో నేను వాదోపవాదాలు చేయను. వాళ్ళ అభిప్రాయాలు తెలుసుకోను. నువ్వు మంచిదానివా–చెడ్డదానివా అని ఆలోచించి న్యాయం కలుగచేసేందుకు నాకు తీరికలేదు. చండీగఢంలో పాత భైరవిణులంతా ఎలాగడిపారో నువ్వూ అలాగే గడపాలి ఇవాళ నువ్వు భవనంలో వుండవలసిందే.

[ఈ ఆజ్ఞవిని ఆమె వజ్రాహతిగా వుండిపోతుంది.]

జీవా:– నీ విషయంలో యింత సహనం ఎలా చూపగలిగానో, నాకే అర్థంకావటంలేదు. ఎవరైనా అమర్యాదగా ప్రవర్తించినట్లయితే– నౌకర్లకు అప్పగించేవాన్ని. నేనిలా చాలా మందిని పంపించాను.

షోడశి: [అగస్మాత్తుగా ఏడుస్తుంది. పైట చెంగును మెడలో వేసుకుని చేతులు జోడించి.] నావద్ద వున్నదంతా తీసుకుని నన్ను వదలిపెట్టండి.

జీవా:– ఎందుకమ్మా! ఈ ఏడుపులు నాకేమీ క్రొత్తగాదు. ఈ భిక్షంకూడా నేను క్రొత్తగా వింటున్నాను. కాని, వాళ్ళను పతీ పుత్రులున్నారు. వాళ్ళు ఏడ్చారంటే కొంతఅర్థముంది. [షోడశి భయపడి తలయెత్తుతుంది.] కాని నీ కటువంటి బాదరబందీ ఏమీలేదు [illegible] పది హేను పదహారేండ్లనుంచి నీభర్తను, నువ్వు కళ్ళతో

కూడా చూసి ఎరుగవు. అంతేకాక మీకు యీ విష యంలో తప్పేమీ లేదు.

షోడశి:- [చేతులు ముకిళించి, నా రుద్ధ కంఠంతో] నా భర్తగారిని సరిగ్గా ఎరుగని విషయం నిజమే! కాని. వారే అయితే బాగుండేది. నే నింతవరకూ ఎటువంటి దోషము చేయలేదు. దయవుంచి వదలి పెట్టండి.

జీవా:- [గట్టిగా పిలుస్తాడు] మహావర్!

షోడశి:- [కంపిస్తూ] మీకు నా ప్రాణమైనా తీయండికాని-

జీవా:- సరే,యీచేష్టలన్నీ వాళ్ళయింటివద్దచేయ్! మహావీర్!

షోడశి:- [ఏడుస్తూ] నా ప్రాణంవుండగా నన్నిక్కడనుంచి ఎవరూ తీసుకుని వెళ్ళలేరు. నాకెంత అవమానం అత్యా చారం జరగాల్సివుందో అదంతా మీముందే జరగ నివ్వండి! మీ రిప్పటివరకూ బ్రాహ్మణులే, మీరింత వరకు పెద్దమనుష్యులే!

జీవా:- [కఠినంగా విమపునవ్వు నవ్వి] నీ మాటలు వినడాని కంత అసహ్యంగాలేవు. కాని, నీ ఏడ్పుచూచి నాకు దయ కలుగదు. ఇటువంటి యేడుపులు నేను ఎన్నో విన్నాను. ఆడవాళ్ళమీద నా కేమాత్రం జాలిగాని దయగానీ, లేదు. నాకు నచ్చకపోతే—నా హృదయా నికి సంతోషం కలిగించకపోతే — నేను వాళ్ళను నౌకర్లకు వప్పచెప్పేస్తాను. నిన్నుకూడా యిచేవాణ్ణే! కాని, ఇవాళ నా కేదో మమతగావుంది. ఎందుకో సరిగ్గా తెలియదు, మత్తువదలనిదే తెలియదేమో!

మహా:- [తలుపువద్దకు వచ్చి] ప్రభూ!

జీవా:- [ముందున్న గదిని చూపి] దీన్ని ఈ రాత్రంతా, ఆ గదిలో బంధించు. ప్రొద్దున చూదాం.

షోడశి:- [కన్నీళ్ళు కారుస్తూ] నన్ను సర్వనాశనం చేయండి! నన్ను ఉరితీయండి! రే పీ ముఖం ప్రజల కెలా చూపించను?

జీవా:- ఏదో ఒకటి రెండురోజులు క్రొత్తగా ఉంటుంది. ఆ తరువాత చూపించగలవు. ఉఫ్! నాకు గుండెనొప్పి ఎక్కువైంది. ఇప్పుడు ఎక్కువగా వాగించవద్దు. వెళ్ళు

మహా:- [గట్టిగా] లే. లే. మరదలుపిల్లా-పద.

జీవా:-[పిడుగులా గర్జిస్తూ] అరె పందీ! ఏమన్నావ్-? వొళ్లు తెలుసుకునిమాట్లాడు. ఈమారు నా అనుజ్ఞలేనిదే ఆడ వాళ్ళను తీసుకునివచ్చావంటే, తుపాకితో కాలుస్తాను. [తలదగ్గిరున్న దిండ్లను కడుపుకానించుకుని మూలుగుతూ] ఇవాల్టికి ఆ గదిలో వుండు. రేపు నీ సతీత్వం మీద తగిన శ్రద్ధతీసుకుంటాను. నా యెదుటనుంచి తీసుకుని వెళ్ళు.

మహా:- [మెల్లగా] పదండి.

[షోడశి లేచి నిలుచుని వెళ్ళబోతూంది.]

జీవా:- షోడశీ, కొంచం ఆగు. ప్రఫుల్లుడు లేడు. అతను పట్నం వెళ్ళాడు. నువ్వు చదువుకున్నావా-?

షోడశి:- ఆ!

జీవా:- అయితే ఒక్క పని చేసిపెట్టి వెళ్లు, అదుగో అక్కడ ఒక పెట్టె వుంది. అందులో చిన్నవీ పెద్దవీ సీసాలు వున్నయ్! వాటిల్లో ఒకదానిమీద 'మత్తు' అని

ప్రాసుంటుంది. దానిలోంచి నిద్రపోయేందుకు కొంచెం యిచ్చి వెళ్ళు. కాని జాగ్రత్త. అది భయంకరమైన విషం. మహావీర్ ! దీపం చూపించు.

[మహావీర్ దీపం చూపిస్తూంటాడు]

షోడశి:— [దీపం వెలుతురులో కంపిస్తున్న చేతులతో సీసాను తీసి] ఎంత పోసి యివ్వమంటారు ?

జీవా:— [తీవ్రమైన బాధతో మూలుగుతూ] కొంచెమేనని చెప్పానుగా ! నేను లేవలేను. నావణుకుతున్న చేతుల మీద నాకు నమ్మకంకూడా లేదు. కళ్ళుకూడా మాతలు పడిపోతున్నయ్. దానిలోనే ఒక ఆలిచిప్ప వుంటుంది. దాన్లో సగంమాత్రమే యివ్వు. ఒక్క చుక్క ఏమాత్రమన్నా ఎక్కువపోశావా, నీ చండీ దేవత తండ్రికూడా నన్ను నిద్రనుంచి లేపలేరు.

షోడశి:— [ఆలిచిప్పను వెదకడంలో చేతులు కంపించినయ్. ఎంతో నిదానంగా ఆలిచిప్పలో మందుపోసి దగ్గరకు వచ్చి నిలుచుంటుంది]

జీవా:— [చేయిచాపి విషాన్నందుకుని త్రాగుతాడు] చాలా తక్కువే యిచ్చావు. బహుశా పనిచేయదనుకుంటూను. అదే చాలులే.

షోడశి:— [ప్రక్కగదిలోకి వెళ్ళబోతుంది. ఇంతలో నందీశుడు తొందర తొందరగా ప్రవేశించి, జీవానందుని చెవిలో ఏదో గొణుగుతాడు. జీవానందుని ముఖం మీద మార్పు కనిపిస్తోంది. షోడశితలువుపద్దనే స్తంభించిపోయినదానిలా నిలుచుంటుంది. ]

జీవా:- [చేతితో సైగచేసి] నీ కేమీ భయంలేదు. నావద్ద కిలా రా ! [షోడశి దగ్గరకు వస్తుంది] పోలీసులు యీ యింటని ముట్టడించారు. మేజస్ట్రేటుగారు లోపలికి వచ్చేస్తున్నారు. రావడమేమిటి...వచ్చినట్లే- [షోడశి త్రుళ్ళిపడుతుంది] జిల్లా మేజస్ట్రేటు టూర్ బయలు దేరి, ఒక కోసుదూరాన క్యాంపు వేశారు. నీ తండ్రి రాత్రికి రాత్రే అక్కడికి వెళ్ళి యీ సంగతులన్నీ చెప్పాడు. అందువల్ల పరిస్థితి యింతదూరం రాలేదు. కాని, మేజస్ట్రేటువారికి నామీద కోపం ఎక్కువ. ఆయన గతసంవత్సరమే నన్ను పట్టుకోవాలని చూశాడు. కాని నేను పట్టుపడలేదు. అయినా, ఇవాళ ఒక్కసారే పట్టుబడ్డాను. [కొద్దిగా నవ్వుతాడు

నంది:- [తెల్లబడిన ముగంతో] ప్రభూ! ఈసారి నేనుకూడా తప్పించుకోలేనేమో !

జీవా:- నిజమే ! [షోడశితో] నామీద పగ తీర్చుకోవా లంటే నీ కిదే మంచిసమయము. నన్ను ఖైదుకూడా చేయించే తాహతు నీకుంది.

షోడశి:- ఇందులో జైలు ఎందుకు ?

జీవా:- ఎందుకేమిటి ? అదంతా న్యాయశాస్త్రం. అంతే కాదు. ప్రస్తుతం మేజస్ట్రేటుగారి చేతిలో చిక్కి పోయాను. 'బాడడ్ బాగాన్ మెన్'లో యితనికి దొరికాను. జామీనుఇవ్వలేదు. అందువల్ల పదిహేను యిరవై రోజులు వారిఆధీనంలో వుంతవలసివచ్చింది. అయినా అప్పుడు జామీన్ ఎవరుంటారు ?

షోడశి:– [ఉత్సాహంతో] అయితే మీరొకప్పుడు 'బాదుక్ బాగాన్ మెన్'లో వున్నారా"

జీవా:– అవును ఆ సమయంలో నేనొక ప్రణయకాండలో నాయకునిగా నిలబడ్డాను. ఆ ఘోష్ నేను చెప్పినదే మీ వినలేదు. పోలీసులకు పట్టిచ్చాడు. సరే, అదంతా పెద్దకథ. దొరగారు నన్నింకా మర్చిపోలేదు. బాగా గుర్తించారు. ఇవాళకూడా పానిపోగలను. కావి, ఈ నొప్పి నన్ను మంచంమీదనుంచి లేవనీయడంలేదు.

షోడశి:– [కోమలకంఠంతో] అయితే మీనొప్పి యింకా తగ్గలేదా ?

జీవా:– లేదు. ఇప్పుడిక యీ నొప్పి తగ్గదు.

షోడశి: [కొంచెంసేపు మెదలకుండావుండి] అయితె ఇప్పుడు నేను ఏమి చేయాలి.

జీవా:– ఏమీలేదు. నువ్వు నీ యిష్టానుసారంగానే యిక్కడికి వచ్చినట్లు చెప్పు. అంతే, యీ సహాయానికిమారుగా నేను నీ దేవోత్తరసంపదను వదిలిపెడతాను. వెయ్యి రూపాయలు రొక్కం యిస్తాను ఇకమీదట వన్నేమీ తీసుకోను.

నంది:- [ఏదో చెప్పబోయి – షోడశిముఖంచూసి ఆగిపోతాడు.]

షోడశి:– [సరిగ్గా జీవానందుని ముఖంలోకి చూస్తూ] ఈ సంగతి నేను చెప్పకుంటే, ఏమవుతుందో – మీకు తెలుగుదుకదా? ఆ తరువాతకూడా, యీ భూమీ –

పుత్రా - ధనమూ అంతా నా ఆధీనంలో వుంటుం దనే మీరు నమ్ముతున్నారా ?

జీవా:- [ముఖం తెల్లబడిపోతుంది] నిజమే, షోడశీ ! నిజమే. జీవితంలో నువ్వింతవరకూ పాపంచేయలేదు. ఇక ముందుకూడా చేయలేవు! అది నిజమే! [నవ్వి] నువ్వన్నట్టు, ధనానికీ, సంపదకూ, నిజాయితీని అమ్మలేము! అది నేను మరిచేపోయాను. నిజమే! అయితే నువ్వు నిజమేచెప్పు. జమీందారుతరఫున నీకేమీ అపాయం కలుగదు.

నందిః- [వ్యాకులపడుతూ ఏదో చెప్పబోతాడు. కాని, బయటనుంచి తలుపు నెవరో కొడుతుంటారు. నందీశుని నోరు మూతపడుతుంది]

జీవా:- తెరిచేవుంది. లోపలికి రండి.

[తలుపు తెరుచుకుంటుంది. మేజస్ట్రేటూ, యిన్స్పెక్టరు, కొందరు పోలీసులూ-తారాదాసు ప్రవేశిస్తారు.]

తారా:- [లోపలికి ప్రవేశిస్తూనే ఏడుస్తూ] ధర్మావతారా! ప్రభూ! అదుగో ఆ అమ్మాయే నాకూతురు, చండీదేవిపూజారిణి. మీరు దయదలచకుంటే డబ్బుకోసం యీమెను వీళ్ళు చంపేవాళ్ళు.

మేజ:- [షోడశిని ఎగాదిగచూచి] నీపేరేనా షోడశి? నిన్ను యింట్లోంచి వీళ్ళు లాక్కొచ్చి బంధించారా-!

షోడశి:- [తలూపి] లేదు. నాయిష్టంమీదనే యిక్కడికి వచ్చాను. నా శరీరాన్నెవరూ ముట్టుకోలేదు.

తారా:- [గట్టిగా అరుస్తూ] కాదు ప్రభూ! అంతా అబద్ధమే. వాళ్లో నివాళ్ళంతా సాక్ష్యమున్నారు. నాబిడ్డ వంట చేస్తూంటే పదిమంది జమీందారు మనుష్యులు వెళ్ళి, కొట్టుకుంటూ లాక్కొని వచ్చారు.

మేజ:- [జీవానందుని వేపు క్రీగంట చూచి) షోడశీ. నువ్వు భయపడకద్దు. నిజం చెప్పు. నిన్ను యింటినుంచి వీళ్లు లాక్కొచ్చారా-?

షోడశి:- [తలూపుతూ] లేదు. నాకై నేనే వచ్చాను.

మేజ:- ఇక్కడికి రావడానికి నీకంత అవుసరమేముంది ?

షోడశి:- నాకు పనివుంది.

మేజ:- ఇంతరాత్రయినా, యింటికి వెళ్ళ లేదేమి ?

తారా:- [అరుస్తూ] కాదు ప్రభూ! అంతా అబద్ధం. అన్నీ చెప్పాడుమాటలు. మొదటినుంచి, చివరవరకూ చెప్పాడుమాటలు.

మేజ:- [అతని మాటల వేపు ధ్యానంపుంచకుండా, ఈల వేస్తూ, మొదట తుపాకిని, ఆ తరువాత పిస్తోలును ఎత్తి చూసి] Ihope you have permission for this. ఇవి మీ దగ్గరుండడానికి లైసెన్సు వుందనుకుంటాను. [మెల్ల మెల్లగా బయటికి వెళ్ళిపోతాడు]

తారా:- [నిశ్చేష్టుడై మతిపోయినవాడిలా నిల్చుంటాడు.]

మేజ:- [నేపథ్యంలో] నా గుర్రాన్ని యిక్కడికి తీసుకుని రారా! [గుర్రపుడెక్కలధ్వని వినిపిస్తుంది]

తారా:- [అకస్మాత్తుగా హృదయవిదారకంగా యేడుస్తూ ఇన్స్పెక్టరుకాళ్ళమీదపడి] బాబుగారూ! నాగతేం

తారా:- [ఉన్మత్తునిలా] ఆలస్యముండదా ? ఛండాలినీ ! నిన్ను ఖూనీచేయకుంటే నేను మనోహర చక్రవర్తి కొడుకునుగాను. [గంతువేస్తూ షోడశిని కొట్టబోతాడు.]

ఇన:- [అతన్ని పట్టుకుని, గదిమి] ఇక మీరెక్కువగా మాట్లాడినట్లయితే, మిమ్మల్ని అరెస్టుచేసి ఠాణాకు తీసుకువెళ్ళవలసి వస్తుంది. మర్యాదగా యింటికి పదండి.

[తారాదాసును లాక్కుంటూ ఇనస్పెక్టరు, మిగలిన పోలీసులంతా వెళ్ళిపోతారు. నందీశుడుకూడా వాళ్ళ వెనకాలే మెల్లగా బయటికి వెళతాడు. దూరంగా తారాదాసు కేకలు మెల్ల మెల్లగా క్షీణించిపోతూవుంటయ్]

జీవా:- [సైగచేసి, షోడశిని దగ్గరగా పిల్చి] వీళ్ళతో నువ్వు ఎందుకని వెళ్ళలేదు-?

షోడశి:- నేను వాళ్ళతో యిక్కడికి రాలేదు.

జీవా:- నీకు సంపద రాసియివ్వడానికి రెండుమూడు రోజులు పడుతుంది. కాని డబ్బు యిప్పుడే పట్టుకువెళ్తావా-?

షోడశి:- తీసుకునివెళ్తా నివ్వండి.

జీవా:- [దిండుక్రిందనుంచి నోట్లకట్టనుతీసి వాటిని లెక్కపెడుతూ - మాటిమాటికి షోడశిముఖంవేపు చూసి నవ్వుతాడు] నాకు సిగ్గనేది లేదు. కాని, యీనోట్లను నీచేతిలో పెట్టడానికి సంకోచిస్తున్నాను.

షోడశి:- [శాంతంగా] మరి యిస్తానని మాటయిచ్చారుగా?

జీవా:- మాట అలావుండనీయ్. కాని, ఇవాళ నువ్వు నన్ను రక్షించేందుకు చేసిన త్యాగాన్ని డబ్బుతో విలువ కడుతున్నాను. అంతకంటే కట్టుబడిపోవడమేమంచిది.

షోడశి:- [జీవానందుని వేపు పరకాయించి చూసి] అయినా ఆడవాళ్ళ విలువను మీరెప్పుడూ డబ్బుతోనే సరి తూచ్చుతుంటారు. [జీవానందుడు మాట్లాడడు.] సరే. మీసిద్ధాంతం మారినట్లయితే డబ్బు యివ్వ నక్కరలేదు. మిగిలినదికూడా అవుసరంలేదు. కాని, నిజంగా మీరు నన్ను గుర్తుపట్టలేదా ? కొంచెం పరకాయించి చూడండి!

జీవా:- [షోడశి వేపు రెప్ప వేయకుండా చూస్తాడు. చాలాసేప యాక] బహుశా గుర్తించా ననుకుంటాను. చిన్న తనంలో నీపేరు అలకకదూ-?

షోడశి:- [ముఖమంతా జేగురిస్తుంది] నాపేరు షోడశే లెండి! భైరవిణులకు వేరే పేరేమీ వుండదు. కాని, మీకు అలక జ్ఞాపకముందా?

జీవా:- [నిరుత్సాహంతో] కొద్దికొద్దిగా జ్ఞాపకంవుంది. అప్పు డప్పుడూ మీఅమ్మగారి హోటలులో భోజనంచేయు డానికి వచ్చేవాణ్ణి అప్పుడు నువ్వు చిన్నదానివి, కాని, నువ్వు నన్ను ఒక్కసారే గుర్తుపట్టేశావే-?

షోడశి:- ఒక్కసారే కాదులెండి! అయినా గుర్తించగలిగాను. మీకు అలకతల్లి జ్ఞాపకం వుందా-?

జీవా:-ఉన్నది. ఆమె జీవించేవుందా-?

షోడశి:- లేదు. పదేండ్ల క్రితమే చనిపోయింది. మీ కంటే ఆమె కెంతో ప్రేమకదూ-?

జీవా:- [ఉద్వేగంతో] అవును. ఒకసారి ఆపదల్లో వుండి, ఆమెవద్ద వందరూపాయలు అప్పుగా పుచ్చుకున్నాను. తిరిగి యివ్వనే లేదు.

షోడశి:- అవును. తిరిగి యివ్వలేదు కాని, అందుకోసం మీరు మనసులో కష్టపడకండి! ఎందుకంటే అలకతల్లి ఆడబ్బును మీకు అప్పుగా యివ్వలేదు. అల్లునికి కట్నంగాయిచ్చింది. [కొంచెంసేపు ఆగి] మీరు బాగా ఆలోచించి చూసినట్లయితే, ఆ రోజుకూడా యిటువంటిదేదేనని మీకు జ్ఞాపకం వస్తుంది. ఇవాళ మీకు షోడశి ఋణం మిక్కిలి .భారమైనదిగా తోచవచ్చు. కాని, ఆనాటి అలకతల్లి ఋణంకూడా అంత తక్కువైనదికాదు చౌదరిగారూ!

జీవా:- ఆ కొంచం డబ్బుకోసం, తనకూతురిని వివాహంచేసుకోమని చెప్పకుంటే అలాగే అనుకునేవాణ్ణి,

షోడశి:- వివాహం చేసుకోమని ఆమె బలవంతం చేయలేదు. పైగా మీరే బలవంతంచేశారు. సరే, ఆ వెదవ సంగతి వదిలిపెట్టండి! మీరు వివాహం చేసుకోలేదు. కాస్త పూజా చేసారు. కన్యాదానమైయాక తిరిగి కలవడం యిదే మొదటిసారి.

జీవా:- కాని తదుపరి నీకు నిజంగా వివాహమైందనివిన్నాను.

షోడశి:- అంటే యింకొకరితోనా-? అంతేకదూ? అయినా ఒక నిరుపాయపిల్ల అదృష్టంలో అటువంటిది జరిగి వుంటే, మీతో ఆమెకేమీ సంబంధంలేదు.

జీవా:- లేదని మీ అమ్మకు తెలుసు! కేవలం నిన్ను మీ తండ్రినుంచి వేరుచేయడానికే మీతల్లి —!

షోడశి:- వివాహమునేతంతు జరిపించింది. కావచ్చు. అలకతల్లి జీవించిలేదు. నేను అలకనో కాదో తెలియదు. ఇంత కాలమయాక, మీ విషయాన్ని గురించి ఆలోచించ వలసిన అవసరంకూడా లేదు.

జీవా:- [కొంచెంసేపు తలొంచుకునివుండి.] కాని నీ అసలు సంగతి అందరి ఎదుట చెప్పినట్లయితే-!

షోడశి:- అసలుసంగతంటే ? వివాహం సంగతేగా? కాని, అదీ అబద్ధమేగా-! అంతేకాదు. ఆ సమస్య అలకది. నాది కాదు. రాత్రంతా గుక్కపెట్టడిచి, అసలు కథ బయటపెట్టినంత మాత్రాన, యీ షోడశికి జరగ వలసిన అవమానం వీసమెత్తు తగ్గుతుందా?

జీవా:- [కొంచెంసేపునీరసంగావుండి] షోడశీ! ఇవాళ నేనుచాలా అధోగతికి దిగిపోయివున్నాను. నా భార్యవని చెప్పు కున్నా నువ్వు మనసులో నవ్వుకుంటావు. అయినా ఆ నాడు బీజగ్రామ జమీందారు వంశీకులవధువని, సంఘంనెత్తిన రుద్దటం అంత మంచిపనేనా ?

షోడశి:- ఆ సంగతి నాకు సరిగ్గా తెలియదు, కాని ఆ పని మాత్రం నిజమని నేను నమ్మేదాన్ని. అయినా నేను వ్యర్థంగా వాగుతున్నాను. ఇవ్వాళివన్నీ మీ ముందు

ప్రలోభించడం వ్యర్థమే, నేను వెళుతున్నాను. నాకు ఏ వస్తువైనా యివ్వడానికి ప్రయత్నించవద్దు. అందువల్ల నాకు అవమానం ఎక్కువవుతుంది.

జీవా:- [నందీశుడు లోపలికి రావడం చూచి] నందీ! ఇక్కడెవరైన డాక్టరు దొరుకుతాడా? ఒక్కసారి కబురుచేసి పిలవనంపగలవా ? అతను కోరింది యిస్తాను.

నంది:- డాక్టరెందుకు లేడు ప్రభూ! ఇక్కడ వల్లభడాక్టరుకు మంచి పేరుంది [షోడశి వేపుచూస్తాడు]

జీవా:- [వ్యగ్ర కంఠంతో] అయితే అతన్నే పిలిపించు నందీ ఒక్క నిముషంకూడా ఆలస్యంచేయవద్దు.

నంది:- నేను వెళతాను. కానీ ప్రభువులను ఒంటరిగా ...

జీవా:- [అమిత బాధపడుతూ-బోర్ల పడుకుంటూ] అబ్బబ్బ! యీ బాధను సహించలేను.

షోడశి:- నందీ! నువ్వు వల్లభడాక్టరును తీసుకునిరా, ఇక్కడ చేయవలసినది నేను చేసుకుంటాను.

[నందీశుడు గాబరాతో వెళ్ళిపోతాడు]

జీవా:- [కొంచెంసేపు బోర్లా పడుకుని, ఆ తరువాత తలెత్తి] డాక్టరింకా రాలేదా ! అతనిల్లెంత దూరంలో వుంటుంది ?

షోడశి:- దగ్గరే; కాని అయిదారు నిముషాల్లోనే రాగలరా ?

జీవా:- అయిదారు నిముషాలేనా అయింది. అరగంట గడిచిందనుకున్నాను. [బోర్లాపడుకుంటాడు] ఆయన కూడా రాడేమో అలకా ?

షోడశి:- [కొంచెంసేపు మెదలకుండా వూరుకొని] డాక్టరు గారు తప్పక వస్తారు.

జీవా:- బహుశా నేను బ్రతకననుకుంటాను. ఊపిరితీసుకోవడానికి కూడా నాకు కష్టంగావుంది. ప్రపంచంలో గాలి అనేదే లేదేమో ననిపిస్తూంది.

షోడశి:- అయితే మీకు చాలా కష్టంగా వుందా?

జీవా:- ఔను; నన్ను క్షమించు అలకా! భగవంతుని నేను నమ్మను. అందుకు అవసరంకూడా కలగలేదు. కాని, కొంచెంసేపటిక్రితమే నేనతన్ని మొదటిసారి స్మరించాను. ఈ జీవితంలో నేను అనేకపాపాలు చేశాను. వాటికి అంతూ పంతూ లేదు. వాటి భారమంతా మోయవలసి వుంటుందని, యిప్పుడనుకుంటాను. [క్షణం ఆగి] మానవుడు అమరుడు కాడు, మృత్యువు ఎప్పుడువచ్చి యీ జీవుణ్ని తీసుకొని వెళుతుందో చెప్పలేము. యీ బాధ యింక భరించలేను. అబ్బబ్బ అమ్మా......

[బాధతో మెలికలు తిరుగుతుంటాడు. షోడశి తలవద్ద కూచుని పమిటచెంగుతో విసురుతూ వుంటుంది. జీవానందుడు ఏమీ మాట్లాడకుండా, ఆమె కుడిచేతిని పట్టుకుని గుండె మీద పెట్టుకుంటాడు.]

జీవా:- [క్షణమయాక] అలకా!

షోడశి:- మీరు నన్ను షోడశి అనే పిలవండి!

జీవా:- ఇక అలకగా మారవా?

షోడశి:- మారను!

జీవా:— ఏనాడైనా ఏకారణంతోనైనా—!

షోడశి:— మీ రింకే విషయమైనా మాట్లాడండి. [జీవానందుడు వూరుకుంటాడు] మీ బాధేమన్నా కొంచెం తగ్గిందా—?

జీవా:— [తలూపి] కొంచెం తగ్గినట్లుంది. సరే, నేను బ్రతికినట్లయితే, నీకేమీ వుపకారంచేయలేనా—?

షోడశి:— లేదు. నేనుసన్యాసినిని. నాకేమీవుపకారంచేయలేరు.

జీవా:— సరే. సన్యాసినివైనా తృప్తిపరచగలది ఏదీలేదా?

షోడశి:— ఉండవచ్చు. కాని, దానికోసం మీ రింత వ్యాకులం జెందడం దేనికి—?

జీవా:— [నీరసంగా నవ్వి] నాలో అనేక దోషాలు వున్నయ్! ఇతరులకు మేలుచేయాలని నే నెప్పుడూ వ్యాకులపడలేదు. నామీంద ఎవరూ, ఏదోషమూ ఆరోపించలేరనే ఇప్పుడు నీతో చెప్పుతున్నాను. నయమైన తరువాతకూడా ఆసంగతే చెపుతాను. దీనికేమీ నమ్మకంలేదు. కాని, నే నలాగే యీ జీవితాన్ని గడిపాను. అదితప్ప నా కిం కేమీ కనుపించలేదు.

[షోడశి మెదలకుండా కూచుని చెమటతుడుస్తూవుంటుంది.]

జీవా:— [ఆ కొంచేయి పట్టుకుని] అయితే సన్యాసులకు సుఖదుఃఖాలు వుండవా—? వాళ్ళను సంతోషపెట్టే వస్తువు ప్రపంచంలోనే లేదా—?

షోడశి:— వుంది. కానీ, అది మీచేతిలోనిపని కాదు.

జీవా:— కాని ఇప్పటికి నేననే సది ఏమిటో చెప్పు-?

షోడశి:— మీకు నయమయాక అడగండి చెపుతాను.

జీవా:- [ఆమెచేతిని గుండెలమీదికి లాక్కొని] కాదు-కాదు.
నయమయ్యేది కాదు. ఈ కఠినమైన స్థితిలో వున్న
ప్పుడే చెప్పు నేను ఎంతోమందిని కష్టపెట్టాను.
ఈనాడు నా యీ దుఃఖసమయంలోనే, పరాయి
వాళ్ళ దుఃఖాల్నీ, పరాయివారి ఆశలను వింటాను.
అసలు యీ దుఃఖంనుంచి నాకు సద్గతివుందా-?
[బయట అడుగులచప్పుడు వినిపిస్తుంది. షోడసి తన
చేతిని విడిపించుకుంటుంది.]

షోడశి:- డాక్టరుగారు వస్తున్నట్లున్నారు.
[డాక్టరూ, నందీశుడు ప్రవేశిస్తారు]
[డాక్టరు షోడశిని చూచి త్రుళ్ళిపడతాడు. ఏమీ మాట్లాడకండా రోగిదగ్గరకు వెళ్ళి పరీక్షిస్తుంటాడు. అదే సమయంలో షోడశి వెళ్ళిపోతుంది.]

నంది:- డాక్టరుగారూ! మీరుగనుక నయంచేశారంటే బహు
మతిమాట అటుంచండి! మేమంతా మీకు బానిస
లుగా వుంటాము.

డాక్టరు:- [పరీక్షచేయడం ముగించి] చెత్తా - చెదారం తిని
రోగం తెచ్చుకున్నాడు. జాగ్రత్తగా వుండకుంటే
లీవర్ ముదిరిపోగలదు. అందువల్ల చాలా అపాయం
వుంది. ఇప్పటినుంచే జాగ్రత్త తీసుకుంటే లీవర్
ముదరకపోవచ్చు. అప్పుడు కొంత అపాయంకూడా
తగ్గవచ్చు. యింతకూ మందుతినడంమాత్రం ముఖ్యం.

జీవా:- ఈస్థితిలో నేను కలకత్తావెళ్ళడం సంభవిస్తుందా
లేదా-? మీ రది చెప్పండి.

డాక్టరు:- వెళ్ళగలిగితే వెళ్ళవచ్చు. లేకుంటే లేదు.
జీవా:- ఇక్కడవుంటే నయమవుతుందని మీరు చెప్పగలరా?
డాక్టరు:- [విజ్ఞునిలా తలూపి] లేదండీ! ఆసంగతి చెప్పలేను. అయినా యిక్కడవుంటే తగ్గవచ్చు. కలకత్తా వెళితే తగ్గకపోవచ్చు.
నంది:- ప్రభువువారి బాధ—?
డాక్టరు:- ఈ బాధ హఠాత్తుగా ఎక్కువవుతూ వుంటుంది. హఠాత్తుగా తగ్గుతూ వుంటుంది. కాని, నేను ఇంకొక సారి యిక్కడికి రావలసినఅవుసరం వుంది.
[నందిబాబువద్ద ఫీజు తీసుకుని వెళ్ళిపోతాడు.]
జీవా:- ఇప్పుడేంగాను నందీ-?
నంది:- భయమేముంది ప్రభూ? మందు వస్తుంది. ఈ వల్లభ డాక్టరుగారి మిక్చరు ఒక్క సీసా త్రాగినట్లయితే, రోగం ఎగిరిపోతుంది.
జీవా:- [తోడసి వెళ్ళిపోయిన దర్వాజా వేపు చూసి] ఒక్కసారి ఆమెను...!
నంది:- [ ఒక్కసారి బయటికి వెళ్ళి క్షణ ంయాక వచ్చి ] ఆమె లేదు. ఇంటికి వెళ్ళినట్లుంది ప్రభూ! తెల్లవారబోతూంది.
జీవా:- [వ్యాకులపడుతూ] నాకు చెప్పనిదే వెళ్ళదు. అలా జరగదు నందీ!
నంది:- ఆమెగారు డాక్టరుగారు రాగానే వెళ్ళిపోయింది. ఆమె తిన్నగా యింటికివెళ్ళడం బయటకూచున్న మన సరదారు చూచాడట

జీవా:- [కొంచెం సేపు ఆకాశంలోకి చూచి] అయితే దీపం ఆర్పి నువ్వు కూడా వెళ్ళు నందీ! నేను కొంచం సేపు నిద్రపోతాను.

[నందీశుడు మైనపువత్తిని ఆర్పి వేస్తాడు. జీవానందుడు బాధపడుతూ - ప్రక్కకు తిరిగి పడుకుంటాడు. దీపం ఆరి పోయిన వెంటనే ప్రభాతారుణ కాంతులు కిటికీలోంచి లోపల వ్యాపిస్తాయ్]

[తృతీయ దృశ్యం]

[చండీ దేవాలయపు వీధి-మధ్యాహ్నం-ఫకీరు-షోడశి మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు]

ఫకీరు:- అందరూ అనుకుంటుండే మాటలు విని వుండలేక యిటు వచ్చేశాను తల్లీ! మరి ఆనాడు నువ్వు జమీందారు నెందుకు రక్షించావో నాకు అర్థం కావటం లేదు.

షోడశి:- అంత జబ్బుగా వున్న మనిషిని జెయిలుకు పంపడమే మంచిదంటారా ఫకీరుగారూ?

ఫకీరు:- ఆ సంగతి ఆలోచించవలసింది రాజావారుగాని, నువ్వు కాదమ్మా! అదీగాక జెయిల్లో కూడా ఆసుపత్రులుంటయ్. జబ్బు చేసినవాళ్ళకు అక్కడ చికిత్స చేస్తుంటారు. అతన్ని రక్షించేందుకిదే కారణమైతే, నువ్వు చేసింది చాలా అన్యాయమే ననుకుంటాను. [షోడశి కదలకుండా ఫకీరు ముఖంలో చూస్తూ వుంటుంది.]

ఫకీరు:- సరే జరిగిపోయిందేదో జరిగిపోయింది. అయినా, నీ భవిష్యత్తుకోసం, యీ అపరాధం దిద్దుకోవాలి షోడశీ!

షోడశి:- అంటే –!

ఫకీరు:- అతను చేసిన అపరాధాలకూ, అత్యాచారాలకూ అంతులేదు. ఈ సంగతి నీకు తెలుసు! అతన్ని శిక్షించడం అవుసరం.

షోడశి:- [క్షణం సేపునిశ్శబ్దంగా వుండి] నాకంతా తెలుసు! అతన్ని దండించడమే మీకర్తవ్యం కావచ్చు. కాని, నాసంగతి ఒకరికి చెప్పవలసిందికాదు. అతనికి విరుద్ధంగా నేను సాక్ష్యం చెప్పలేను.

ఫకీరు:- ఆనాడు చెప్పలేకపోవచ్చు. కాని భవిష్యత్తులో ఎప్పుడూ చెప్పలేవా ?

షోడశి:- చెప్పలేను.

ఫకీరు:- ఆత్మరక్షణకోసమైనా చెప్పలేవా ?

షోడశి:- చెప్పలేను.

ఫకీరు:- ఆశ్చర్యమే ! [కొంచెంసేపాగి] నువ్విప్పుడు దేవాలయంలోకి వెళ్ళుతున్నావు. అయితే యిక నేను వెళ్ళి వస్తాను.

[షోడశి వంగి నమస్కరిస్తుంది. ఫకీరు వెళ్ళిపోతాడు. అన్యమనుస్కురాలిలా షోడశి వెళుతూ వుంటుంది. ఇంతలో సాగరుడు గబగబా వచ్చి ఎదురుగా నిలుచుంటాడు.]

సాగరు:- అదేమిటమ్మా; మీతండ్రి తారాదాసు గదులన్నిటికీ తాళాలు వేసి, నిన్ను యింట్లోంచి వెళ్ళగొట్టారని విన్నాను. పైగా వాళ్ళంతా కలిసి చండీ దేవాలయా

నికి కొత్తబైరవిని తీసికొచ్చి నీకు సెలవుయిస్తారని కూడా విన్నాను. అలా జరగనీయనమ్మా! ఈ సాగరుడు బ్రతికివుండగా అలా జరగనీయను.

షోడశి:- ఈ సంగతి నువ్వెక్కడ విన్నావు సాగర్?

సాగర్:- విన్నానమ్మా! విన్నే ఏమిటో తెలుసుకుందామని, నీదగ్గరకు పరుగెత్తుకు వచ్చాను. నువ్వు ఆడదానివనీ వొంటరిగా వున్నావని జమీందారు మనుష్యులు నిన్ను పట్టుకుని వెళ్ళారు. అయితే అదీ నీ తప్పేనా? ఆ తప్పంతా గ్రామానిది. తప్పంతా, తన బంధువుల దగ్గర ఆనంద మనుభవించడానికి వెళ్ళిన యీ సాగరునిది. తప్పంతా - గ్రామములోవుండి కూడా ప్రతీకారంచేయలేని యీ సాగరుని సిన తండ్రిది.

షోడశి:- సాగర్ ఒకవేళ మీ రిద్దరున్నా మీ రేమిచేయగలరు? జమీందారు మనుష్యు లెంతమందివున్నారో ఆలోచించావా ?

సాగర్:- ఆలోచించా నమ్మా! ఆతనికి చాలామంది మనుష్యులున్నారు. చాలామంది సిపాయిలు వున్నారు. బీదవాళ్ళం కావడంవల్ల వాళ్ళు మమ్మల్ని సతాయిస్తుంటారు. మమ్మ్మ ఎన్నికష్టాలపాలుచేసినా చేయనియ్. మేము హీనజాతివాళ్ళము కానీ, అమ్మా ఆజ్ఞ అయినట్లయితే, నీ వంటిమీద చేయివేసిన ఆ జమీందారును, మెడ త్రాడు వేసి, రాత్రికిరాత్రే తీసుకుని వచ్చి బలియిస్తాము. ఎవరూ ఆపలేరు.

బెట్టివెళ్ళిన దయాళువు ఎవరో కొంచెం చెప్పండి—!
నిజంచెప్పండి? వారిని నేనెరుగుదును.

నిర్మల్:- తెలుసా? ఐతే చెప్పు-?

హైమ:- ఇంకెవరు. భైరవి. కాని, ఆమె మీకు ఎక్కడ కలిసిందో నాకు అంతుపట్టలేదు.

నిర్మల్:- అంతుపట్టదు. చాలాదూరాన కలిసింది. మీఫకీరు సాహెబుగారి విషయంలో చాలావిషయాలు విని, ఒక్కసారి చూచివద్దామని వెళ్లాను. ఆయన్ను వెదకుతూ బయలుదేరాను. ఆయన ఆశ్రమము నదీతీరాన వుంది. తీరా అక్కడికెళ్ళిచూస్తే-భైరవి కూచునివుంది.

హైమ:- ఆమె ఫకీరుగారిని గురువులా చూస్తుంది. ఆయన మీద ఆమెకు భక్తిశ్రద్ధలు మెండు. కాని, నిజంగా మిమ్మల్ని చేయిపుచ్చుకుని యింటికి చేర్చింది ఆమేనా?

నిర్మల్: నిజమంతే! అటువంటి గాలి వర్షంలో భయంకరమైన కటికిచీకటిరాత్రి నేను అంధుడినని గ్రహించినట్లుంది. ఆమె స్త్రీ అయివుండికూడా, సంకోచమనేది లేకుండానే, నా చేయి పట్టుకుని 'రాండి' అన్నది. మరి ఇతరులకు నువ్వాపని చేయగలవా హైమా—?

హైమ:- చేయలేను.

నిర్మల్:-నాకు తెలుసు, [కొంచెమాగి] చూడు హైమా! నేను యీ భైరవిని సరిగ్గా అర్థంచేసుకోలేకపోయాను. కాని, ఈమెవిషయంలో సాధారణ నియమాలను అన్వయించి న్యాయవిచారణ చేయడం అన్యాయ మవు

తుంది. అదీగాక సతీత్వమనేది ఆమెకు మామూలు వస్తువుకాదు. మీలాగు దాని యథార్థరూపాన్ని ఆమె తెలుసుకోనేలేదు. గౌరవం, కళంకం, కీర్తి అనే జిజ్ఞాస ఆమెకు లేదు.

హైమః- మీరు ఆనాటి జమీందారు వ్యవహారాన్ని మనసులో పెట్టుకుని మీరు మాట్లాడుతున్నారా-?

నిర్మల్ః- అందులో ఆశ్చర్యమేమీ లేదు. దారంట ఒకరితో ఒకరు కలిసి ఏడడుగులు నడిచారంటే స్నేహం ఏర్పడుతుందని పెద్దలు అంటారు. నిర్మానుష్యమైన అంత త్రోవంట, దుర్భేద్యమైన అంధకారంలో, ఆమె సహాయముతో కొన్ని వేల అడుగులు నడిచాను. అనేక ప్రశ్నలు వేశాను. కాని, ఆమె ముందేవిధంగా వుందో యిప్పుడూ అలాగే మౌనవ్రతం పట్టింది. రహస్యం ఏమీ తెలుసుకోలేకపోయాను.

హైమః- మీ తర్కంలో కూడా పడలేదా-? మీ స్నేహాన్ని కూడా అభిలషించలేదా-?

నిర్మల్ః- లేదండీ లేదు. ఏమీ లేదు, అటువంటిదేదీ వ్యక్తపర్చలేదు.

హైమః- [నవ్వి] మిమ్మల్ని గురించిన వివరాలు కూడా అడగలేదా-?

నిర్మల్ః- ఇంత గొప్ప సంగతిని, నవ్వుతూ బయటికి లాగాలని చూస్తున్నావా? అయినా తెలుసుకునేందుకు చాలా కాలం పడుతుంది.

హైమః- ఆలస్యమవనీయండి! అయినప్పటికీ మగవాళ్ళు తెలు

సుకోగలదు. కాని ఆడవాళ్ళు జీవితాంతం, తమ అదృష్టంలోని విచారాలతోనే గడిచిపోవాలనే శాప ముంది.

నిర్మల్:- [ఆమెచేయిపట్టుకుని] హైమా! నీకేమైనా పిచ్చా! పద. మనం కొంచెం తొందరగా వెళ్ళాం పద. పూజకు ఆలస్యమవుతుందేమో.

[ఇద్దరూ నిష్క్రమిస్తారు]

చతుర్థ దృశ్యము.

నాట్యశాల.

[చండీగఢ్ దేవాలయం. దానికి ఆనుకునివున్న వసారా. ఎదురుగా విశాలమైన ఖాళీస్థలం, ప్రహరీగోడ కనుపిస్తూ వుంటుంది. ప్రాంగణంలో నాట్యశాలలోని కొంతభాగం కనిపిస్తూవుంటుంది. వాలయపుతలుపులు తెరిచేవుంటాయ్. దక్షిణపు వేపు ప్రాంగణంలోకి రావడానికి తలుపు వుంటుంది. ప్రాతఃకాల సమయం. ఒకవిధమైన వెలుతురు ఎల్లెడలా వ్యాపించి వుంటుంది. మందిర ప్రాంగణంలో జనార్ధనరాయ్, శిరోమణి, నిర్మలుడు, షోడశి, హైమవతి-యింకా స్త్రీ పురుషులు చాలామంది కూచునివుంటారు.]

శిరో:- [షోడశితో] ఇవాళ హైమవతి తన కొడుకు కల్యాణం కోసం చేయిస్తున్న పూజలో నీకేమాత్రం అధికారం లేదు. నువ్వు పూజచేస్తే తన అభీష్టం నెరవేరదని ఆమెకు సందేహంగావుంది.

షోడశి:- [తెల్లబడిన ముఖంతో] మంచిదేగా-తనకెలా నచ్చితే అలాగే చేయించుకోవచ్చు.

శిరో:- అంతేకాదు. ఇకమీదట యీగుడిలోని దేవకార్యాలన్నీ నువ్వు చేయడానికి వీలులేదు. ఆ సంగతి గ్రామపెద్దలమైన మేమంతా నిశ్చయించుకున్నాము. ఇక నువ్వు భైరవిగా వుండడానికి వీలులేదు. ఎవరక్కడ-? వెళ్ళి తారాదాసుని పిల్చుకుని రండి

[ఒకమనిషి పిలుచుకుని రావటానికి వెళతాడు]

షోడశి:- ఎందుకని వీలులేదు-?

ఒకవ్యక్తి:-రాబోవు చైత్రసంక్రాంతినాడు కొత్తభైరవికి అభిషేకంజరుగుతుంది ఇదేమేము నిశ్చయంచేసుకున్నాం.

[తారాదాసు పదేళ్ళపిల్లను వెంటబెట్టుకునివస్తాడు]

హైమ: [తారాదాసువేపు చూసి] అయితే, మేము వింటున్న మాటలే నిజమని నమ్మితీరవలసిందేనా-?

తారా:- ఎందుకని నమ్మకూడదు?

హైమ:- [ఆ చిన్నపిల్లను వేలితో చూపించి] ఆ పిల్లను నిశ్చయంచేసి తీసుకుని వచ్చినప్పుడు, వీరు అబద్ధం చెప్పడంకూడా అసంభవంకాదు. అంతకంటే సత్యాసత్యాల పరీక్ష జరగడమే మంచిది. ఒకపక్షంవారి మాటలను నమ్మి ఫైసలాచేయకూడదు.

[అందరూ విస్మితులవుతారు]

శిరో:- [నవ్వుతూ] అమ్మాయి బారిష్టరుగారి భార్యకదూ ? అందుకని వాదన ప్రారంభించింది. నేను యీమె ఆట

కట్టిస్తాను. [హైమవతితో] ఇది దేవాలయం, పితస్థానం. ఇది నువ్వు వొప్పుకుంటావా—?

హైమ:- [తలూపుతూ] ఎందుకని వొప్పుకోను?

శిరో:- ఒక వేళ అదే నిజమైతే, తారాదాసు బ్రాహ్మణుడై వుండికూడా, దేవమందిరంలో నిలుచుని అబద్ధమాడుతాడా పిచ్చిదానా? [గట్టిగా నవ్వుతాడు]

హైమ:- మీరు అందులోనివారేనండి శిరోమణిగారూ! మీరు కూడా దేవమందిరంలో నిలుచుని అబద్ధాల వర్షం కురిపిస్తున్నారు— వారివల్ల నాకు పనిజరగదుఅని, నేను ఒక్కసారీ అనలేదు.

[శిరోమణి హతబుద్ధు డవుతారు]

జనా:- [కోపంతో] ఎందుకని చెప్పలేదు?

హైమ:- లేదు నాన్నా! అనలేదు. నేను అనడం అటుంచి, అసలా సంగతి నాకు మనసులోనే మెదలలేదు. పైగా నే నామెతోనే పూజచేయిస్తాను. దాని వలన నా బిడ్డకి మంచికలగనీయండి చెడు కలుగనీయండి! [ఫోడశితో] మందిరం లోకిపదండి! ముహూర్తందాటిపోతుంది.

జనా:- [ధైర్యాన్ని కోల్పోయి లేచి నిలుచుని భీషణ కంఠంతో] వీలులేదు. నేను బ్రతికి వుండగా ఆమెను మందిరంలోనికి రానీయను. తారాదాస్ అందరి ఎదుటా ఆమెతల్లిసంగతి బయటపెట్టు, అందరూ వింటారు.

శిరోమణి:- [ఆయనతోపాటు నిలుచుని] వద్దు. తారాదాసు చెప్పనవసరం లేదు. ఆయన మాటను మీఅమ్మాయి

నమ్మాదు. రాయ్‌గారూ! ఆమే స్వయంగా చెపుతుంది. చండీదేవతకు ఎదురుగా నిల్చుని తన తల్లిసంగతి ఆమె చెపుతుంది. ఏమంటావు చటర్జీ? నీ అభిప్రాయ మేమిటి భట్టాచార్యగారూ? ఏం? ఆమె స్వయంగా చెబుతుంది.

షోడశి:- [ముఖం తెల్లబడిపోతుంది.]

హైమ:- మీ రంతా యీామె న్యాయా న్యాయాల్ని విచారించాలంటే విచారించండి! కాని యీామెగారిచేత, యీామె తల్లిసంగతి చెప్పించడం .చాలా అన్యాయం. దాన్ని నేను జరగనీయను. [షోడశితో] పదండి! నాతో పాటు మందిరంలోకి రాండి!

షోడశి:- లేదు చెల్లీ, నేను పూజచేయను. నిత్యమూ యీ పని ఎవరు చేస్తుంటారో వారే చేస్తారు. నేను మాత్రం యిక్కడే నిలుచుని నీ కొడుకును ఆశీర్వదిస్తాను. అతను చిరంజీవి దయానిధి కావాలి. [పూజారితో] ఎందుకు సందేహిస్తున్నారు. పూజారిగారూ! నేను ఆజ్ఞాపిస్తున్నాను. యథారీతిగా దేవీపూజ చేయించి నీ భాగానికివచ్చినది తీసుకుని. మిగిలినది మందిరభాండారంలో పెట్టి తాళాలు నా కేపంపించండి. [హైమవతితో] నేను తిరిగి ఆశీర్వదిస్తున్నాను. నీ కుమారునికి శుభం కలుగుగాక! [షోడశి ప్రాంగణం లోంచి బయటకు వెళ్ళిపోతుంది. పురోహితుడు పూజచేయించేందుకు మందిరంలోకి వెడతాడు.]

జనా :- [నిర్మలుని - హైమవతిని ఉద్దేశించి] మీరుకూడా పూజారితో పాటు వెళ్ళి పూజ చేయించండి.

[నిర్మలుడు-హైమవతి దేవాలయంలోకి వెళతారు.]

జనా:- సరే, బతికిపోయాం శిరోమణిగారూ! షోడశి తనంతట తానే వెళ్ళిపోయింది. ఆ పిల్ల నానాహంగామా చేసి, నా మనుమడి మానసపూజ చెడగొట్టలేదు అంతే చాలు.

శిరోమణి:- అంతపనీ జరిగేదే రాయ్‌గారూ! మహామాయ మాయను ఎవరాపగలరు? ఇదంతా ఆమె చలువే!

[అని చేతులుముకుళించి దేవతకు నమస్కరించాడు.]

యోగేంద్ర భట్టాచార్య:- [మెడసారించి చూచి] అరే! స్వయంగా ప్రభువుగారే దయచేస్తున్నారే!

[అందరూ ఆశ్చర్యచకితులవుతారు. జీవానందుడు, ఆయనవెనక కొందరు నౌకర్లతో ప్రవేశిస్తాడు.]

శిరోమణి:- జానార్దనరాయ్! దయచేయండి. దయచేయండి.

[అందరూ నమస్కరిస్తారు.]

జనా:- తమరు దయచేయడం నా అదృష్టమనుకుంటాను. ఇవాళ నా మనుమడి కళ్యాణార్థం పూజ చేయిస్తున్నాను.

జీవా:- అదా సంగతి? అందుకనే ఇంతమంది గుమికూడారన్నమాట?

[జనార్దనరాయ్ వినయంగా తలొంచుకుంటాడు.]

శిరో:- తమ ఆరోగ్యం బాగా వుందండీ?

జీవా:- ఆరోగ్యమా? [నవ్వి] బాగానేవుంది. అందుకనే

యివాళ సాహసించి బయటికి రాగలిగాను. తీరా చూస్తే గుంపులు గుంపులుగా జనం యిటే వస్తున్నారు. నేను వాళ్ళను వెంబడించాను. నా అదృష్టం బాగా వుంది కనుకనే బ్రాహ్మణులను, సాధుసన్యాసులను కలసుకో గలిగాను; రాయ్‌గారిని నేను గుర్తించగలిగాను. కాని, తమర్ని సరిగ్గా గుర్తుపట్టలేకుండా వున్నాను.

జనా:- వీరు సర్వేశ్వర శిరోమణిగారు. చాలా నిష్టాపరులైన బ్రాహ్మణులు. గ్రామానికి ముఖ్యులు.

జీవా:- మంచిది సరే! సరే! చాలా ఆనందమైంది. సరే నేను యిక్కడే కూచుంటాను. [ఆయన కూచునేందుకు ప్రయత్నించడం చూచి అందరూ వ్యస్తులవుతారు]

శిరోమణి:- [గట్టిగా] ఆసనం- ఆసనం- ఎవరన్నా ఒక ఆసనం పట్టుకునిరాండి!

జీవా:- ఎందు కంత హాహావిడిపడతారు. శిరోమణిగారూ! నే నెంతో వినయంగలవాడిని. సమయం వచ్చినప్పుడు రోడ్డుమీద పడుకోవడానికి కూడా సంకోచించను. ఇక యిది దేవుని మందిరం. ఏమీ పర్వాలేదు. [జీవా నందుడు కూచుంటాడు].

జనార్దన:- ఒక గురుతరకార్యంకోసం మేమంతా మీ వద్దకు రావాలనుకున్నాం కాని, మీ ఆరోగ్యం బావుండ లేదని విని రాలేకపోయాము.

జీవా:- గురుతరకార్యమా ?

శిరోమణి:- అవును ప్రభూ! గురుతరమైన కార్యమే! షోడశి పూజారిణిగా వుండడం మా కిష్టంలేదు.

జీవా:- ఇష్టంలేదా ?

శిరో:- లేదు ప్రభూ ! ఇష్టంలేదు.

జీవా:- ఏవేవో కొన్ని సంగతులు నా చెవినికూడా పడ్డాయి. ఇంతకూ ఆమెమీద మీ రారోపించే నేరమేమిటి ?

[అంతా నిశ్శబ్దంగా కూచునివుంటారు]

జీవా:- చెప్పడానికి మీకు నోరురావడంలేదా ?

జనార్దన:- ప్రభువులు సర్వజ్ఞులు. మా ఫిర్యాదు...

జీవా:- ఏమి టా ఫిర్యాదు ?

జనార్దన:- మా గ్రామములోని చిన్న పెద్దలమంతా కలిసి...

జీవా:- [కొంచంగానవ్వి] చూస్తూనేవున్నాను. [వ్రేలితో చూపిస్తూ] ఆయనేకదూ ! భైరవితంత్రి తారాదా సంటే -?

[తారాదాసు మాట్లాడకుండా తలవంచుకుంటాడు.]

శిరోమణి:- [వినయంగా] రాజుదృష్టిలో ప్రజలు బిడ్డలాంటి వారు, వారు దోషులైనా - కాకపోయినా, బిడ్డలతో సమానమే! అసలు యిప్పు డీ విషయం ఒకరకంగా యితనిదే: షోడశి ఈయనకూతురే. ఇక మీదట ఆమెను పూజారిణిగా వుండనీయగూడదని మేమంతా నిశ్చయించుకున్నాం. అంచేత ఆమెను దేవకార్య కలాపాలనుంచి తప్పించమని తమరిని కోరుతున్నాం.

జీవా:- [చకితుడై] ఎందుకని-? ఆమెచేసిన అపరాధమేమిటి?

ఇద్దరు ముగ్గురు:- [ఒకేస్వరంతో] పెద్దఅపరాధమే చేసింది.

జీవా:- హఠాత్తుగా ఆమె అంత గొప్ప అపరాధ మేమి చేసింది రాయ్‌గారూ-?

[జనార్ధనరాయ్ జవాబు చెప్పమని శిరోమణికి సైగ చేస్తాడు.]

జీవా:- కాదు- కాదు. ఆయన చాలాకష్టపడ్డాడు. ముసలి వాణ్ని యింకా ఎక్కువ కష్టపెట్టవలసిన అవుసరం లేదు. అసలు సంగతేమిటో మీరే చెప్పండి.

జనార్ధన:- [సంకోచంతో] ఆమె బ్రాహ్మణబిడ్డ. ఆ విష యం నా నోటితో చెప్పించకండి!

జీవా:- గో- బ్రాహ్మణులయందు తమకున్న అచంచలమైన భక్తి విషయం యిక్కడివాళ్ళకు తెలియనిదికాదు. కాని, యింత మందిని వెంటబెట్టుకుని, స్వయంగా మీరే నడుముబిగించి నిలుచున్నప్పుడు యిది గురుతర మైన విషయమేనని నాకు నమ్మకం కలిగింది. అయినా ఆ విషయం మీ నోటిగుండానే వినాలనుంది.

జనా:- [శిరోమణి వేపు కోపంగా చూస్తూ] ప్రభువుగారు స్వయంగా వినాలనుకున్నప్పుడు భయమెందుకు మహా రాజా! నిర్భయంగా చెప్పు!

శిరో:- [వ్యస్తుడై] నిజం చెప్పడానికి భయమెందుకు జనా ర్ధన్. తారాదాసు కూతురు నడవడిక చెడిపోయింది. అందుకని ఆమె యిక్కడ వుండడానికి వీలులేదు.

[జీవానందుని ముఖంలో పరిహాసదీప్తి మాయమవు తుంది. ఆ ముఖంలో అకస్మాత్తుగా గంభీరత, కాఠిన్యం గోచరిస్తాయి.]

జీవా:— ఆమెనడవడిక చెడిపోయిందనే సంగతి మీకు నిశ్చయంగా తెలిసిందికదూ ?

[అంతా తలలూపి ఒప్పుకుంటారు.]

జీవా:— అంచేత న్యాయంపొందాలనే ఆశతో యీ భీష్మదేవుణ్ణి ఆశ్రయించారన్నమాట ? ఏం రాయ్‌గారూ!

శిరో:— తమరు దేశానికి రాజులు. న్యాయమో అన్యాయమో తమరే నిర్ణయించాలి. దాన్ని మేము అంగీకరించాలి. ఈ చండీగఢమంతా తమదే !

జీవా:— [నవ్వి] చూడండి శిరోమణిగారూ ! అతి వినయంతో మీరు వంగివంగి నమస్కరించవలసిన అవసరంలేదు. అతి గౌరవంతో నన్ను ఆకాశానికి ఎత్తవలసిన అవసరంకూడా లేదు. అసలు యీ దోషారోపణ నిజమా అనేదే నాకు కావాల్సింది.

[ఎక్కువమంది ఉత్తేజంతో చంచలులవుతారు.]

శిరో:— దోషారోపణా? నిజమా — కాదా ? సరే, మేమంతా పరాయివాళ్ళమే. కాని, తారాదాస్ ! నువ్వే చెప్పు, రాజసభ......ధర్మం చెప్పాలి.

తారా:— [తారాదాసుముఖం ఒకసారి తెల్లబడి మరొకమారు శుష్కించినట్లు కనబడుతుంది. జనార్దనుని కోపపునూపులు అతని శరీరాన్ని తూట్లువడేట్లు చేస్తుంటయ్. ఒకసారి గుటకలు మింగుతూ మరొకసారి గొంతు సవరించుకుంటూ — చివరకు ప్రాణాలరచేతిలో పెట్టుకుని] ప్రభూ......!

శివ:- [చేయెత్తి అతన్ని నివారిస్తూ] నాకతని నోటంట ఇతని కూతురు కళంకాన్ని గూర్చి యథాధర్మమైనా నేను వినను. అయినా, మీలో ఎవరైనా 'యథాధర్మం' చెప్పగలిగివుంటే చెప్పండి,

[ఆ చుట్టుప్రక్కలనే చాటుగా నౌకరు వున్నాడు. వాడు ఒకగ్లాసు విస్కీ - సోడా కలిపి యజమాని చేతికి అందిస్తాడు. ఆయన ఒక్కగుక్కలో గ్లాసుఖాళీచేసి నౌకరుకు యిస్తాడు.

జీవా:- ఉఫ్. పోయినప్రాణం లేచివచ్చింది. మీవాక్యసుధను త్రాగిత్రాగి, దాహంతో గుండె ఎండిపోయింది. అయినా - అంతా వూరుకున్నారేం ? మీ 'యథా ధర్మ' మేమైంది.

[శిరోమణి గుడ్డతో ముక్కు మూసుకుంటాడు.]

జీవా:- [నవ్వి] శిరోమణిగారికి 'క్షురాగ్రే అర్ధభోజనం' అయి పోయినట్టుంది ?

[అందరూ నవ్వుతూ ముక్కు మూసుకుంటారు.]

శిరో:- [మాతబద్ధుడై] చెపుతున్నాను ప్రభూ! నేను వున్నది వున్నట్లుగానే చెపుతాను.

జీవా:- [తలూపుతూ] అవును! మీరు శాస్త్రజ్ఞులైన బ్రాహ్మణులు. కాని, ఒక ఆడదాని భ్రష్టచరిత్రను ఆమెపరోక్షంలో 'యథార్థంగా' చెప్పినప్పటికీ అది ధర్మమవుతుందా ? అందులో స్వయంగా నాకేమీ ఆపదలేదు. నాలోని ధర్మాధర్మాలు ఎప్పుడో దూరమైపోయినయ్. అయినప్పటికీ వాటి

అవుసరంలేదు. నేను అడిగినదానికి మాత్రం జవాబు చెప్పండి. ప్రస్తుతం వుంటున్న భైరవిని మీరు వెళ్ళ గొట్టాలని చూస్తున్నారు అంతేకదూ?

అందరూ:- [తలలూపి] అవును అవును.

జీవా:- ఆమెనల్లు ఇప్పుడు పనవదంటారు?

జనార్దన:- [ప్రతివాదం చేసేవాడిలా తలెత్తి] పనికావడం, కాకపోవడమనేది కాదు ప్రభూ! గ్రామం క్షేమం కోసమైనా ఈ పని ముఖ్యం.

జీవా:- [నవ్వి] అంటే గ్రామము క్షేమం ఎలా వున్నప్ప టికీ యిందులో కొంత మీ క్షేమంకూడా వుందను కోవాలి. ఆమెను వెళ్ళగొట్టేఅధికారం నాకు వుందో లేదో తెలియదు. అయినా నాకు ఆపదలేదు. కాని, యింకేదైనా నెపం కల్పించలేరా? ప్రయత్నించి చూడండి! పైగా మా నందీశుని సాహాయ్యం కూడా తీసుకోండి! ఈ విషయంలో అతనికి చాలా అను భవం ఉంది.

[అందరూ ఆశ్చర్యచకితులవుతారు]

జీవా:- ఈ పూజారిణుల సతీత్వకథలు ప్రాచీన ప్రసిద్ధాలు. అంచేత వాటిని యిప్పుడు వదలిపెట్టనవుసరంలేదు. భైరవి వుంటే భైరవుడు వచ్చి చేరుతాడు. భైరవు లకుకూడా భైరవి లేనిదే పని జరగదు. ఇది పూర్వ కాలంనుంచీ వస్తూన్న ఆచారం. దీన్ని త్రోసివేయ లేము. దేశంలోని భక్తు లందరికీ కోపం రావచ్చు. దేవికూడా సంతోషించకపోవచ్చు. అప్పుడు ఒక వుప

ద్రవం తయారవుతుంది. మాతంగిభైరవికి అయిదారు గురు భైరవులు వుండేవారని విన్నాను. అంతకు ముందున్న భైరవికి వున్న భైరవులను లెక్కపెట్టలేము. ఏమంటారు శిరోమణిగారూ ! మీరు యీ ప్రదేశానికి ప్రాచీన పురుషులు. ఇవన్నీ మీకు తెలుసా-?

శిరో:- [శుష్కించిన ముఖంతో మెల్లగా] ఇతను అన్నీ విన్నట్లుందే !

[ప్రఫుల్లుడు ప్రవేశిస్తాడు. అతని చేతిలో ఇంగ్లీషు - బెంగాలీ పత్రికలూ - కొన్ని ఉత్తరాలు వుంటాయ్]

జీవా:- ఏమిటవి ప్రఫుల్లా ! ఇక్కడకూడా పోస్టాఫీసువుందా! ఆహా-! ఇవన్నీ ఎప్పుడు పూడిపోతాయోగాని. . . !

ప్రఫు:- [తలూపి] ఆ సంగతి నిజమే ! అవి పూడిపోతే మీకు హాయిగా వుంటుంది. అయినా అవి యిప్పుడు గాని, మరెప్పుడుగాని పూడవు. వీటిని చూడడానికి కొంచం సమయం దొరుకుతుందా ? అర్జెంటు వుత్తరాలు.

జీవా:- ఆ సంగతి గ్రహించాను. లేకుంటే వాటిని యిక్కడకెందుకు పట్టుకుని వస్తావు ? కాని, వాటిని చూసేందుకు సమయం యిప్పుడూ - యికముందూ కూడా దొరకదు. కాని, బయటనుంచి చూస్తేనే అవి ఏమిటోననేది గ్రహించాను. దానిమీద హీరాలాల్ మోహన్‌లాల్ ముద్రవుంది. ఆ వుత్తరం అతని వకీలు దగ్గరనుంచా లేక తిన్నగా కోర్టునుంచి వచ్చిందా? ఆ కవరు సలోమన్ దొరగారిదిలా వుందే ? విదేశీ అప్పు

తపువాసన కాగితాన్ని చించుకుని బయటకు వస్తోందే! ఆ దొరగా రేమంటున్నారేం ? డిక్రీ అమలుజరుపు తాడా లేక యీ రాజుశరీరాన్ని బయటకు యీడ్చేస్తాడా ? ఏం రాసివుంది ? ఓహో! పూర్వకాలపు బ్రాహ్మణతేజం కొంచమన్నా నాలో మిగిలి వున్నట్లయితే యీ యూరపుజాతివాణ్ణి ఒక్కసారి భస్మంచేసేవాణ్ణి. అప్పుడు విస్కీ-బుడ్డు కొన్న బాకీ తీర్చనవసరం లేకుండాపోయేది.

ప్రఫు:- [వ్యస్తుడై మీ రనేదేమిటి అన్నయ్యాగారూ! అలావుంచండి. వుంచండి. ఇంకొకసారి చూడవచ్చు. [తిరిగి వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతాడు]

జీవా:- [నవ్వి] అరె, సిగ్గెందుకు తమ్ముడూ! వీళ్ళంతా మన మనుష్యులే! మన జ్ఞాతులు. గోత్రీకులు. వీరే మనకు మణి - మాణిక్యాలనడంలో అత్యుక్తిలేదు. అంతే గాదు. నీ అన్నయ్యగారు కస్తూరిమృగంలాంటివారు. సుగంధాన్ని ఎంతకాలం దాయగలం తమ్ముడూ ? ప్రఫుల్లా ! కోపగించవద్దు తమ్ముడూ. నా అని చెప్పు కునేందు కేమీలేదు. పైగా యీ నలభై సంవత్సరాల అలవాట్లను మానుకోలేను. అంచేత దొంగ నోట్లను సృష్టించేవాణ్ణి, ఒకణ్ణి పట్టుకొచ్చావా...

ప్రఫు:- [ఎంతో కోపంవస్తుంది. అయినా నవ్వుతాడు] చూడండి, అన్నయ్యగారూ! మీ మాటలు అందరూ అర్థంచేసుకోలేరు. నిజమనుకొని ఎవరైనా...

జీవా:- [గంభీరంగా] వెదకి తీసుకొని వస్తారు! అప్పుడు

బ్రతికిపోతాను ప్రఫుల్లా! రాయ్‌గారూ! మీరు నా అనుభవజ్ఞులు. మీకు తెలిసుంటే ఎవరినైనా!

జనా:- [కష్టంగా నవ్వి లేచి నిల్చుని] చాలా ప్రొద్దెక్కింది. అనుజ్ఞ యిచ్చినట్లయితే!—!

జీవా:- కూచోండి. కూచోండి! లేకుంటే ప్రఫుల్లునితో శోకం పెరిగిపోతుంది. అంతేకాదు. భైరవి విషయం కూడా ముగించేద్దాం. అయినా – నేను వెళ్ళమంటే, ఆమె వెళ్ళిపోతుందా–?

జనా:- ఆ భారమంతా మాది.

జీవా:- కాని, ఇంకొకరినైనా నియమించాలి. ఆ స్థానం ఖాళీగా వుండకూడదు.

అందరూ:- ఆభారంకూడా మాదే–!

జీవా:- [బతికించారు. అటువంటప్పుడు ఆమె తప్పకుండా వెళ్ళవలసిందే. ఇంతమంది విశ్వాసభారాన్ని ఒక్కడే గడ్డేకాను. చండీమాతకూడా భరించలేదు. మీ ఆ భవష్యాల సంగతి మీకే తెలుసు మా అవస్థ చూస్తుంటే - మాకు డబ్బులభించేపక్షంలో మా కింకేతర మేమీలేదు. ఈ కొత్తయేర్పాటుకు మాకు ఈ డబ్బు పుట్టచెప్పాలి. అన్నను; గుర్తొచ్చింది. ఎక్కడా అక్కడ–! నందీశుడు వున్నాడా, వెళ్ళిపోయాడా–? గొంతెండి మరుభూమిగా మారిపోయింది.

నౌకరు:- [ప్రవేశించి, యజమానిచేతికి విస్కీనిండిన గ్లాసు అందించి] వారు భోజనశాలను చూడ్డానికి వెళ్ళారు ప్రభూ–!

జీవా:- అప్పుడే-? అతన్ని పిలువు. [విస్కీ త్రాగుతాడు.]

పూజార్థులు వచ్చి తమతమ పూజలు ముగించుకుని వెళ్లిపోతుంటారు. [క్రమ క్రమంగా వాళ్ళసంఖ్య పెరుగుతూ వుంటుంది.]

[నందీశుడు ప్రవేశిస్తాడు.]

జీవా:- ఇవాళ నేను భైరవిని పిల్చుకుని రమ్మన్నాను. ఎవరైనా ఆమెకు కబురుచేశారా-?

నంది:- స్వయంగా నేనే వెళ్ళానండీ.

జీవా:- ఆమె వచ్చిందా-?

నంది:-లేదండీ.

జీవా:- ఎందుకు రాలేదు. [నందీశుడు తలవంచుకుని వూరుకుంటాడు] ఎప్పుడు వచ్చేదీ ఏమన్నా చెప్పిందా-?

నంది:-[తలవంచుకునే] ఇంతమందిముందు ఆమె మాటలు ప్రభువుగారికి విన్నవించలేను.

జీవా:- నందీ-! నువ్వు నీ గుమాస్తాగిరి అలావుంచి - ఆమె వస్తుందా. రాదా చెప్పు-?

నంది:- రాదండీ.

జీవా:- ఎందుకని-?

నంది:- ఆమె రాలేనంది. మీ ప్రభువుగారికి న్యాయవిచక్షణా బుద్ధివుంటే, దాన్ని తనప్రజలలో అమలుపర్చుకోమను. నన్ను విచారించుటకు కోర్టులు వున్నాయి. అని చెప్పింది.

జీవా:- [ముఖం గంభీరంగాచేసి] హు, సరే. నువ్వు వెళ్ళు. [నందీశుడు వెళ్ళిపోతాడు.]

జీవా:- ప్రఫుల్లా! ఆ పంచదారకంపెనీవారు అడిగిన వెయ్యి ఎకరాల భూముకి, వి క్రయ దస్తావేజు రాయించావా?

ప్రఫుల్ల:- అవునండి, రాయించాను.

జీవా:- అయితే యిప్పుడే వెళ్ళి అది రిజిస్టరుచేయించు.

ప్రఫుల్ల:- అలాగేనండి-!

[పూజార్థులు - పూజార్థినిలు వచ్చి - వెళుతుంటారు]

జీవా:- ఇవాళ గుంపులు గుంపులుగా పూజకు జనం వస్తున్నారే-! రోజూ యింతేనా-?

జనా:- ఇవాళ కొంచెం విశేష మ్రుంది. అంతేగాకుండా యీ చైత్ర సంక్రాంతిరోజుల్లో పూజార్థులు ఎక్కువగానే వస్తుంటారు.

జీవా:- అలాగా-? చాలా ఆలస్యమైనట్లుంది. ఇక లేద్దాం. [నవ్వి] ఒకసంగతి చూశారా జనార్దనరాయ్‌గారూ-! ఇప్పుడు జమీందారుగారు కాళీమోహన్‌కాదనీ, జీవానందచౌదరని. యీ చండీగఢపు ప్రజలు మర్చిపోతుంటారు. అప్పటికీ, ఇప్పటికీ చాలా తేడావుంది కదూ-?

[ఏమని జవాబుచెప్పాలో తోచక రాయ్‌గారు జమీందారుముఖంలోకి చూస్తుంటారు.]

జీవా: ఇక్కడున్నవాళ్ళలో భీజగ్రామానికి చెందనివాడొక్కడూ లేడనుకుంటాను. ఏమంటారుశిరోమణిగారూ?

శిరో:- అందులో సందేహమేమీలేదండి ప్రభూ-!

జీవా:- లేదు. నాకేమీ సందేహంలేదు. ఇతర్లకూ ఎక్కడా సందేహం లేకుండావుండాలి. సరే. నమస్కారము

శిరోమణిగారూ ! వెళ్ళిపోతాను [నవ్వి] కాని, భైర విని పంపించేవిషయం తేల్చవలసిందే-! పద ప్రఫుల్లా! ఇక వెళదాం పద. [వెళ్ళిపోతారు.]

శిరో:- [జమీందారు నిజంగా వెళ్ళాడో లేదో అని ముని వేళ్ళమీద నిలబడి చూస్తాడు] జనార్దనరాయ్ దీని వల ఏమనుకోవాలి-?

జనా:- చాలా అనుకోవాల్సిందే

శిరో:- మహాపాపి సిగ్గనేది లేదు.

జనా:- [గంభీరంగా] అసలే లేదు.

శిరో:- మహాదుష్టుడు. మొగమాటంలేదు. ఇతరుల మాన మర్యాదలనుగూర్చికూడా ఆలోచించడు.

జనా:- అవును. ఆలోచించడు.

శిరో:- ఆ మాటలతీరు చూశావా ? తిన్నగా మాట్లాడు తున్నదీ, వక్రముతో అంటున్నదీ, నిజమా-అబద్ధమా, ఎగతాళిగా అంటున్నాడా, ఏదీ అర్థంకావటంలేదు. సగం నాకసలు అర్థమేకాలేదు. ఆ మోసగాడు నిజమే చెప్పాడో - లేక మనల్ని కోతులను ఆడించినట్లు ఆడించాడేమో తెలియదు. కాని, అంతా తెలుసను కుంటాను. ఏమంటావు ?

[జనార్దనుడు నిరుత్తరుడవుతాడు.]

శిరో:- మన మనుకున్నంత అమాయకుడు కాదు. అసలు ఏమి జరుగుతుందో ?

జనా:- ఆ కాళీమాత ఇచ్ఛ !

శిరో:- ఇందులో చెప్పడానికేముంది. కాని, విషయమంతా

కలగా పులగం అయిపోయింది. నీ కేమయ్యా! డబ్బుంది. నీకు కావలసినంత సహాయంవుంది. సింహాపుగుహాముందు అసహాయంగా వుంది నేనే!

జనా – మీరు భయపడిపోయూరా ?

శిరో:– లేదు. లేదు భయపడలేదు. ఏముందని భయపడ డానికి? కాని, నీమీదనే నమ్మకంపెట్టుకునివున్నాను. నన్నేమిచేస్తాడో తెలియదు. జమీందారుగారేమో ఖరాఖండిమనిషి. అసలు ఆయనమాటలే నిగూఢంగా వున్నయ్. పనికూడా విచిత్రమే. మనకు బలవంతంగా విస్కీ త్రాగించలేదు. అదే ఆశ్చర్యం. భైరవి మహా రాణిగారు నందీశునితో ఆయనకు పంపిన జవాబు విన్నావుగా? మీరంతా మెదలకుండా వున్నారు. నేనే ఎక్కువగా వాగాను. నేను చేసిన పని మంచిది కాదు. ఆ నందిగాడు యీ విషయాలన్నీ ఆయనకు చెప్పాడేమో ఎవరికి తెలుసు. అందరిమధ్యా యిరు క్కుని నలిగిపోతానేమో!

జనా:– [ఉదాసీనంగా] అంతా ఆ కాళీమాతదయ. చాలా ఆలస్యమైంది. సాయంకాలం ఒకమారు వస్తారా?

శిరో:– అలాగే వస్తాను, కాని, అదుగో – మళ్లీ యిటు వస్తు న్నాడు చూడు.

[మందిర ప్రాంగణంలోని ఒక తలుపుగుండా షోడశీ, ఆమె వెనక సాగరుడు, అనుచరులు ప్రవేశిస్తారు. రెండో తలుపుగుండా జీవానందుడు, ప్రఫుల్లుడు, కొంతమంది నౌకరులు ప్రవేశిస్తారు.]

జీవా:- వెళ్ళిపోతున్నవాణ్ని, నువ్వు వస్తూండడం చూసి, తిరిగి వచ్చాను. నందీశునితో నీకు కబురుచేశాను. నీ జవాబుకూడా విన్నాను. నీకు విరుద్ధంగా గవర్న మెంటువారికోర్టుకు వెళ్ళడం నా కిష్టంలేదు. అయినా-నా ప్రజలను ఎలా శాసించాలో నాకు తెలుసు. గ్రామస్థుల ప్రార్థనల ననుసరించి నీ విషయంలో నేను చెప్పిన తీర్పు విన్నావా ?

షోడశి:- లేదు.

జీవా:- నిన్ను భైరవిపదవినుంచి తొలగించేశాం. కొత్త భైరవిని నియుక్తంచేసి, ఆమెకు మందిరపు భారాన్ని వప్పగిస్తారు. అభిషేకపు రోజుకూడా స్థిరపర్చారు. దేవికున్న సమస్త స్థావరసంపత్తిని నువ్వు —బ్ బాబుగారికి వప్పగించి, పెట్టెతాళాలు వప్పగించి, మా గుమస్తాకు యివ్వు. ఈ విషయంలో నువ్వు ఏమైనా చెప్పకుంటావా ?

షోడశి:- నా మాటలవల్ల ప్రయోజనమేమైనా వుంటుందా ?

జీవా:- లేదు ఏమీ ప్రయోజన ముండదు. అయినా - ఇవాళ సాయంకాలం యిక్కడే ఒకసభజరుగుతుంది. నీకు యిష్టం వున్నట్లయితే పలుగురిలో నీ దుఃఖాన్ని చెప్పుకోవచ్చు. ఆ ..? జ్ఞాపకంవచ్చింది. నాకు విరుద్ధంగా నా ప్రజలను రెచ్చగొడుతున్నావట. నిజమేనా ?

షోడశి:- అది నాకు తెలియదు. అయినా-నా ప్రజలను ఉపద్రవాలనుంచి రక్షించడానికి ప్రయత్నిస్తున్నమాట నిజం.

జీవా:- [పెదిమను పంటితో నొక్కి] రక్షించగలవా ?

షోడశి:- రక్షించడం - రక్షించకపోవడం అంతా ఆ చండీ మాత చేతుల్లో వుంది.

జీవా:- వాళ్ళు చచ్చిపోతారు.

షోడశి:- మానవుడు అమరుడు కాడనే సంగతి వాళ్ళకు తెలుసు. [కోపం, అవమానంతో అందరికళ్లూ ఎర్ర బడతాయ్. నందీశుడు ఎంతో కష్టంతో తన ఆవేశాన్ని ఆపుకుంటాడు.]

జీవా:- [క్షణం సేపు స్తబ్ధుడై] ఇప్పుడు నీ ప్రజలంటూ ఎవరూ లేరు వాళ్ళు ఎవరి ప్రజలో యిప్పుడే నిరూపించారు వాళ్ళను ఎవరూ ఆపలేరు

షోడశి:- [తలెత్తి] ఇంకా మీ హుకుంలేమైనా వున్నాయా? లేవుకదూ ? అయితే దయవుంచి నామాటలు వినండి.

జీవా:- చెప్పు.

షోడశి:- ఇవాళ దేవస్థాన సంపదను వప్పగించేందుకు నాకు తీరుబడి లేదు. సాయంకాలం గుళ్ళో సభ జరగడానికసలే వీలులేదు. ఇవన్నీ ప్రస్తుతం కట్టిపెట్టండి !

శిరో:- [చీత్కారం చేస్తూ] కాదు, కట్టిపెట్టను. నీ కల్లబొల్లి కబుర్లు మా ముందు పనికిరావు.

[జీవానందుడు తప్ప మిగిలినవారంతా యివే మాటలు ప్రతిధ్వనిస్తారు]

జనా:- నీకు తీరుబడి ఎందుకు లేదో దేవాలయప్రాంగణంలో సభ ఎందుకు జరక్కూడదో చెప్పు !

షోడశి:- [వినయంగా] మీ కంతా తెలుసు రాయ్‌గారూ!

ఇప్పుడు చైత్ర సంక్రాంత్రి రోజులు – వైభవంగా ఉత్స వాలు జరుగుతూంటయ్. ఎంతోమంది యాత్రీకులూ— సన్యాసులు వస్తుంటారు. అటువంటప్పుడు గాని తీరు బడి ఎక్కడుంటుంది? వాళ్ళను ఎక్కడకని వెళ్ళ గొట్టాలి?

జనా:– [ఆవేశంతో మైమరచి] జరిగి తీరవలసిందే: తీరుబడి చేసుకోవాలి!

షోడశి:– [జీవానందునితో] పోట్లాటలంటే నాకు అసహ్యము. ఈ పనులు చేయడానికి వీలులేదు. మీరు జనార్దనులకు మీరు నచ్చచెప్పండి. నాకు తీరుబడి ఎక్కువగాలేదు. మీపని అయిపోయినట్లతే యిక సెలవు తీసుకొంటాను.

జీవా:– [కోపంతో] ఇవన్నీ సాయంకాలం వరకు జరిగించే వని ఆజ్ఞాపిస్తున్నాను!

షోడశి:– బలవంతంగానా?

జీవా:– అవును. బలవంతంగానే!

షోడశి:– ఎటువంటి కష్టనిష్ఠూరాలైనా......

జీవా:– అవును. తప్పదు!!

షోడశి:– [వెనక్కు తిరిగి సాగరుని చేసైగతోపిల్చి] నువ్వంతా సిద్ధమేనా—?

సాగర్:– [వినయంతో] సిద్ధమేనమ్మా! తమ అనుగ్రహంవల్ల లోటేమీ లేదు.

షోడశి:– మంచిది. జమీందారుగారి మనుష్యులు యిక్కడ గందర గోళం చేస్తారట. అలా జరిగినియ్యటం నా కిష్టం లేదు. ఈ చైత్ర సంక్రాంతిసమయాన నెత్తు

శీరులు ప్రవహింప చేయడంకూడా నా అభిమతం కాదు. కాని అవుసరంవచ్చినప్పుడు తప్పదు. ఈరును ష్యులను మీరు బాగుగా గుర్తించండి. వీళ్ళలో ఎవ రినీ మందిరపు హద్దుల్లోకి రానీయవద్దు. చంపవద్దు, బలవంతంగా బయటికి నెట్టివేయండి.

[వెళ్ళి పోతుంది.]

ద్వి తీ యా ం క ము.

ప్ర థ మ దృ శ్య ము.

షోడశి కుటీరము

[సంధ్యాకాలపు చీకట్లు దట్టమవు తూంటయి. ఇంటి లోపల దీపం వెలుగుతూంటుంది. షోడశి కూచుని వుంటుంది. ఇంతలో హైమవతీ- నిర్మలుడు ప్రవేశిస్తారు. వెనక నౌకరుంటాడు.]

షోడశి:- రాండి. రాండి. సంగతు లేమిటి? ఇవాళ మధ్యాహ్నపు బండికి మీరు ప్రయాణంకట్టారుగా-?

[నిర్మలుడు - హైమవతి యిద్దరూ దగ్గరగా కూచుంటారు]

హైమ:- అలాగే అనుకున్నాం. కానీ వెళ్ళలేకపోయాము. వీరిని కూడా వెళ్ళనీయలేదు. అక్కగారి ఈ కొత్త యిల్లు కళ్ళతో చూడకుండా వెళ్ళినట్లయితే పశ్చాత్తాపము చెందవలసివస్తుంది.

నిర్మల్:- కళ్ళతో చూశాకైనా పశ్చాత్తాపం తగ్గుతుందని నే ననుకోను.

హైమ:- అది నిజమే! బహుశా కళ్ళతో చూడకుండా వుండడమే

మంచిది. ఈ యింట్లో ఎటువంటి దోషమున్నా - వ్యర్థమైన ఖర్చులున్నాయని, శిరోమణిగారే కాదు, మా నాన్నగారుకూడా అనలేరు. కాని, యీపిచ్చి పనెందుకు చేశావు, అక్కయ్యా! నువ్వీ యింట్లో వుండలేవు.

షోడశి:- ఇంతకంటే హీనమైన కొంపల్లో చాలాకుంది నివసిస్తారు చెలీ.

హైమ:- అయితే, నువ్వు అంతా వదిలిపెట్టడం నిజమేనా?

నిర్మల్:- ఇంతకంటే వేరే వుపాయమేముందో చెప్పు? గ్రామస్థులందరికీ వ్యతిరేకంగా ఒక్క అబల నిలబడి వుండలేదు.

హైమ:- మేము అంతా విన్నాం అక్కయ్యా; నువ్వు సన్యాసినివి. అంతా సహించగలవు. అయినా దానితోపాటు యీ అబద్ధపు అపవాదు కూడా సహించగలవా?

షోడశి:- అపవాదే అబద్ధమైనప్పుడు ఎందుకు సహించలేను. ప్రపంచంలో అబద్ధాలకు తక్కువలేదు. అయినా ఆ అబద్ధాలతో పోట్లాడుతూ అబద్ధపుపని చేయడం సిగ్గు.

హైమ:- అక్కయ్యా! నువ్వు సన్యాసినివి. నీ మాటలన్నీ నేను తెలుకోలేను. అయినా-నిన్ను చూస్తూంటే నా కేమనుపిస్తుందో ఎరుగుదువా? మా మామగారికి గౌరవార్థంగా ఒక రాజాగారు కత్తి నొకదాన్ని బహూకరించారు. దాని ఒరమాత్రం నుట్టిపట్టి మలినంగావుంది. కాని దానిలోని అసలువస్తువుమాత్రం

తళతళ మెరుస్తూంది. అది ఎంత నిర్మలంగా వుంటుందో అంత కఠినంగా వుంటుంది. నిన్ను చూడగానే నాకు అది జ్ఞాపకమొస్తుంది. గ్రామస్థులంత అపోహ పడుతున్నారనీ, అసలుసంగతి ఎవరికీ తెలియదనిపిస్తూంది.

షోడశి:- [హైమవతిచేతిని తన చేతిలోనికి తీసికొని] ఇవాళ మీరెందుకని వెళ్ళలేదు హైమా-? బహుశా రేపు వెళతారనుకుంటాను ?

హైమ:- నా బిడ్డ విషయం ప్రస్తావించిన క్షణాన నీకు కోపం వస్తుంది. అందుకని ఆ విషయం ప్రస్తావించను. కాని, భయంకరమైన గాలివానలో, కటికచీకటిసమయాన యీ గ్రుడ్డిమనిషి చేయిపుచ్చుకుని, నది దాటించి. వారి పాదధూళి పుచ్చుకోకుండా ఎలా వెళ్ళగలను? కాని, నేను వెళ్ళబోయేముందు నాకు ఒకమాటివ్వు. ఎప్పుడైనా, నీకు ఏ మనిషి సహాయ్యం కావలసి వచ్చినా, ఆ సమయంలో యీ నీ ప్రవాసినిని మర్చిపోవద్దు.

[షోడశి మాట్లాడదు]

హైమ:- బహుశా మాటివ్వకూడదనుకుంటున్నావా ?

షోడశి:- మాటిచ్చాను. మర్చిపోను. మర్చిపోలేనుకూడా. దెబ్బమీద దెబ్బ తిని, యివాళ నీకొక వుత్తరం వ్రాస్తున్నాను. నువ్వు వెళ్ళాక పోష్టులో వంపుదామనుకుంటున్నాను. కాని, దాన్ని ముగించలేక పోయాను. దీనివల్ల మీ నాన్నగారితో నీకు పోట్లాట సంభవిస్తుందేమోనని భయపడుతున్నాను.

ఆనందానికి మధుచక్రంలాంటిదనుకుంటాను. భారం ఎక్కువైనకొద్దీ, మధువు అంచులవారుతూంటుంది. అలాగే-! ఇవాళ నిన్నలాగే ఆశీర్వదిస్తున్నాను.

హైమః- [హఠాత్తుగా ... పట్టుని, పాదధూళి తలమీద చల్లుకుని] అదేకావాలి అక్కయ్యా; మన స్త్రీలకు అంతకంటే వేరే ఆశీర్వాద మేమికావాలి-?

నిర్మలుః- ఏమిటో వాగేస్తున్నావు. ఇవాళ నీకేమొచ్చింది-?

హైమః- మీాకేం తెలుస్తుంది-?

షోడశిః- మీాలో తెలుసుకునేశక్తివుందా-?

నిర్మలుః- 'మీాలో' అని అంటున్నారు. అంటే పురుషులలో నేనా-? లేదు. ఇంతగొప్పసత్యాన్ని హృదయంగమం చేసుకునే సామర్థ్యంలేదని నేను వొప్పుకుంటాను. కాని, మీారీసత్యాన్ని ఎలా తెలుసుకున్నారు?

హైమః- ఏం...? దేవతకు పూజారిణి అయినంతమాత్రాన తెలియదా? అయినా పూజారిణి స్త్రీ కాదా-? అయ్యో మహాశయా! యీాతత్వాన్ని మేముప్రయత్న పూర్వకంగా నేర్చుకోము. మేము జన్మించిననాడే విధాత తన దోసిట్లో తెచ్చి మాగుండెలు నింపాడు. ఆసంపదముందు, మేము ఇంద్రాణి సంపదనుకూడా మేము లెక్కచేయము. ఇది నిజంకాదా అక్కయ్యా?

షోడశిః- నిజమే చెల్లీ-!

సౌకరుః- మేఘాలు దట్టంగా అల్లుకుంటున్నయ్ అమ్మగారూ!

హైమః- లేస్తున్నాను.: చాలా వాగేసాను. క్షమించు అక్కయ్యా-!

నిర్మలు:- హైమకు మీరు రాసిన వుత్తరం యిప్పుడే యిచ్చి నట్లయితే, కాలం పోస్టుఖర్చులు కలిసివస్తయ్.

షోడశి:- [నవ్వి] ఇవ్వకపోయినా పరవాలేదు. బహుశా యిప్పుడు దాని అవుసరం లేదనుకుంటాను.

నిర్మలు:- భగవంతుడు అలాగే అనుగ్రహించాలి. అయినా అవుసరం కలిగినప్పుడు యీ భక్తుల్నిమాత్రం మరిచి పోవద్దు.

హైమ:- అయితే యిక వెళ్తాం అక్కయ్యా-! [పాదధూళి తీసుకుని లేచి నిల్చుంటుంది] నీముఖంచూస్తుంటే నాకెన్నోసంగతులు గుర్తుకొస్తున్నయ్ నిన్ను యిక ఎప్పుడూ చూడలేనేమో. ఎంతో దూరం వెళ్ళిపోతు న్నట్లనిపిస్తూంది.

నిర్మలు:- నమస్తే; అవుసరం వచ్చినప్పుడు పిలవడం మర్చి పోయేరు.

[అందరూ వెళ్ళిపోతారు.]

షోడశి: హైమా; ఎన్నాళ్ళకు మళ్ళీ నాకన్నులకు గట్టిన పొరను లాగివేసావు...? ఎవరక్కడ...?

సాగరు:- నేను సాగరున్నమ్మా-!

షోడశి:- నిన్న కలసికట్టుగా వచ్చిన మీసంఘమంతా ఎక్కడ?

సాగరు:- వాళ్ళంతా కలిసి ఇవాళకూడా దొరగారి కచేరీకి వెళ్ళారు. బహుశా మీకు విరుద్ధంగా...!

షోడశి:- ఏమంటున్నావు సాగర్-? నాకు విరుద్ధంగానా-?

సాగరు:- ఇందులో ఆశ్చర్యపడవలసిం దేముందమ్మా-? కష్ట-సుఖాల్లో, అందరూ మీవద్దకువచ్చి విన్నవించుకుం

టుండేవారు. మొదట ఆ అలవాటును వదిలిపెట్టలేక పోయారు. కాని, ఇవాళ జమీందారుగారి బెదిరింపుతో అందరూ తిరిగిపోయినట్లుంది.

షోడశి:– మంచిది. కాని, సభ గుడిలోనే జరుగుతుందటగా–?

సాగరు:– అవును. జమీందారుగారు భోజపుర గ్రామస్థుల మీద నమ్మకం పెట్టుకుని వున్నారు. కాని, వాళ్ళు రావట్లేదు వాళ్ళంతా. ఇక్కడివాళ్ళే యీ మామా అల్లుళ్ళసంగతి బాగా ఎరుగుదురు.

షోడశి: సభలో ఏమని నిర్ణయం జరిగింది–?

సాగరు:– అంతా సవ్యంగానే జరిగిందమ్మా. ఈ మంగళ వారంనాడు ఆ అమ్మాయికి అభిషేకం చేస్తారట. మీకుకూడా చింతనేది లేదు. కాశీవెళ్తానని ప్రార్థించినట్లయితే మీకు నూరు రూపాయలు దొరకవచ్చు.

షోడశి:– జమీందారుగారిని ప్రార్థించాలి కామాలు–?

సాగరు:– అవును, అంతే–!

షోడశి:– పొలం-పుట్రాలేనివారి సంగతి యేమాలోచించారు?

సాగరు:– భయంలేదమ్మా–! మామూలుగా జరుగుతుండే విధానానికి భిన్నంరాదు.

షోడశి:– మరి మీసంగతేమిటి–?

సాగరు:–మా మామా అల్లుళ్ళసంగతా–? [నవ్వి] రాయ్‌గారు అందుకుకూడా తగిన ఏర్పాట్లు చేశారు. ఆయన మొదలకుంటా కూచోలేదు. అనుభవశాలి. ఇన్‌స్పెక్టర్లూ, పోలీసులూ, వారి కీలుబొమ్మలాయె. పదికో

సుల దూరాన ఎక్కడన్నా దొంగతనం జరగడం తగ్గావాయి...?

షోడశి:- [భయపడి] ఏరా. ఇది మీరు నిజమని భావిస్తున్నారా-?

సాగరు: భావించడమా-? ప్రత్యక్షంగా కళ్ళకు కన్పిస్తుందమ్మా-? మమ్మల్ని జైలు బయటవుంచే బలం ఎవరికీ లేదమ్మా? [కొంచం ఆగి] అయినా జైల్లోకి వెళ్ళని వాడి అవస్థ ఇంతా - అంతా కాదమ్మా!

షోడశి:- ఎందుకని ?

సాగరు:- ఎందుకేమిటమ్మా! జెయిలులో మాకు రెండు పూటలా ముద్ద దొరుకుతుంది. కాని వీళ్ళకు అది కూడా దొరకదు. రాయ్‌గారివద్ద అప్పు పుచ్చుకుని జమీందారుగారు భూమి తనఖా పెట్టాడు. అది దావా వేసి డిక్రీ కావడమే ఆలశ్యం. ఆ తరువాత అందులో మా కేదైనా కూలీ దొరికితేసరి. లేదా...!

షోడశి:- లేకుంటే ?

సాగరు:- లేకుంటే అస్సాం "టీ" తోటలు వుండనే వున్నవి. ఏమమ్మా ? పూర్వం మే మెంతమందిమి వుండే వాళ్లమో మీకు తెలుసుగా? మా గూడెం అంతా కలిసి ఒకబస్తీలా వుండేది.

షోడశి:- [తలూపుతూ] అవునవును.

సాగరు:- ఇవాళ వాళ్లంతా ఎక్కడవున్నారు? కొంతమంది బొగ్గు గనుల్లోకి వెళ్ళిపోయారు. మరికొంతమంది 'టీ' తోటల్లోకి వెళ్లబోతున్నారు. కాని, నా చిన్నతనంలో

వాళ్ళకు బండీ, ఎద్దులూ, భూమీ వుండడం చూశాను. వాళ్లకు రెండుపూటలా తిండివుండేది. ఇవాళ వాళ్ళఆస్థిలో సగం నందీశుని చేతిలోనికి వచ్చింది మిగిలినసగం రాయ్‌గారికి దక్కింది.

షోడశి:- [ఆశ్చర్యంపొంది] సరేసాగర్. యీ సంగతులన్నీ నువ్వు ఎవరుచెప్పగా విన్నావు?

సాగరు:- స్వయంగా జమీందారుగారే అన్నారు.

షోడశి:- ఇదంతా జమీందారుగారి నిర్వాహకమే నన్న మాట.

సాగరు:- [ఆలోచించి] మనకేం తెలుస్తుందమ్మా! ఇందులో జనార్దనరాయ్‌గారికి కూడా పాలు వున్నట్లుంది.

షోడశి:- మీ స్థితిచూస్తే యిలావుంది సాగర్. నేనేమో ఒంటరిదాన్ని. జమీందారు తలుచుకుంటే నా మీద కూడా దుండగం చేయవచ్చు.

సాగరు:- ఆ సంగతి నాకు తెలియదమ్మా! కాని, మీరు మాత్రం వంటరివారు కారు. [కొంచెంసేపు మెదల కండావుండి] అమ్మా! మా పరిచయం మేము చెప్పకోకూడదు. అది గురువాజ్ఞ. [లాఠీని పిడికిలితో గట్టిగా పట్టుకుని] హరిహారుని మేనల్లుడు సాగరునిపేరు పది యిరవై గ్రామాలవారికి కూడా తెలుసు. మీ మీద దుండగం చేసేవారు, యీ పాతికగ్రామాల్లో ఎవడూ లేడమ్మా!

షోడశి:- [కళ్ళు అకస్మాత్తుగా తళతళ మెరుస్తున్నయ్.] సాగర్, ఇది నిజమా?

సాగరు:– [తటాలునవంగి లాకేని ఆమె పాదాలముందుంచి] సరేనమ్మా, నా మాట అబద్ధంకాకూడదని మాత్రం ఆశీర్వదించు

షోడశి:– [చూపులు ఒక్కసారిగా కోమలంగా మారి, వెను వెంటనే ప్రజ్వలి స్తూయ్] సరే సాగర్, మీాకు ప్రాణ భయంలేదని విన్నాను. నిజమేనా ?

సాగరు:– [నవ్వి] అబద్ధమమ్మా. ఆ మాట నేను చెప్ప లేదు.

షోడశి:– ప్రాణాలర్పించడమే కాని, మీారు ప్రాణాలు తీయ లేరా ?

సాగరు:– తీయలేమూ...? అందుకనుజ్ఞ యివ్వమని ఎన్నో మార్లు ప్రార్థించానమ్మా. కాని మీా రటువంటి అనుజ్ఞ యివ్వనేలేదు.

షోడశి:– వద్దుసాగర్, వద్దు. అటువంటి మాటలు మీా నోటితో అనవద్దు.

సాగరు:– కాని, [illegible]లోంచి దాన్ని కదిలించలేకుండా వున్నానమ్మా.

[పూజారి ప్రవేశిస్తాడు.]

పూజారి:– గుడి తలుపులు మూసివచ్చానమ్మా.

షోడశి:– తాళాలేవీ ?

పూజారి:– ఇవిగో—! [తాళపుగుత్తి యిచ్చి] ప్రొద్దు పోయింది, అనుజ్ఞ యిచ్చినట్లయితే వెళ్తాను.

షోడశి:– సరే వెళ్ళు.

[పూజారి వెళ్ళిపోతాడు]

షోడశి:- సాగర్, ఫకీరుగారు వెళ్ళిపోయారు. వారు ఎక్కడున్నదీ కనుక్కొని నాకు కబురు చేయగలవా నాయనా ?

సాగరు:- ఎందుకమ్మా ?

షోడశి:- నాకు వారితో అవుసరమైన పని ఉంది. మీ తరువాత నా మంచికోరేవారు ఆయనతప్ప యింకెవరూ లేరు.

సాగరు:- ఆయన సిద్ధుడనీ, సాధువనీ మీరే చెప్పారు. మన స్ఫూర్తిగా తలచుకుంటే వారు ప్రత్యక్షమవుతారని కూడా చెప్పారు.

షోడశి:- [త్రుళ్ళిపడి] నేను యింత గొప్పవిషయాన్ని మర్చిపోయాను సాగర్ ! ఇక నాకేమీ విచారంలేదు. ఇంత గొప్ప దుఃఖసమయాన వారు రాకుండా వుండ లేరు.

సాగరు:- నా విశ్వాసంకూడా అదేనమ్మా! చాలా రాత్రి యింది. మీరు విశ్రాంతి తీసుకోండి. నేను వెళ్ళనా ?

షోడశి:- సరే వెళ్ళు.

సాగరు:- [కొద్దిగానవ్వి] భయమేమీ లేదమ్మా. సాగరుడు మిమ్మల్ని వొంటరిగావదలి ఎక్కువసేపు ఎక్కడా వుండలేడు. [వెళతాడు.]

[షోడశి సంధ్యావందనములో నిమగ్నమవుతుంది]

షోడశి:- ఎంత గొప్పవిషయాన్ని సాగరుడు జ్ఞాపకంచేశాడు! ఫకీరుగారూ, మీ రెక్కడున్నా యీ ఆపదసమ

యంలో నాకు దర్శనభాగ్యం కలుగజేయి.

[తెరలో]

నేను రావచ్చునా-?

షోడశి:- [త్రుళ్ళిపడి లేచి నిలుచుంటుంది. వ్యాకులకంఠంతో] రాండి. రాండి. నేను మనస్ఫూర్తిగా మిమ్మల్నే స్మరిస్తున్నాను.

జీవా:- ఇంత గొప్ప పతిభక్తి యీ కలికాలంలో దుర్లభమే! నాకు అర్ఘ్యం, ఆసనం అన్నీ ఏవి!

షోడశి:- [క్షణంసేపు నిశ్చేష్టంగావుండి. భయంతో] అరే తమరా-? తమ రెందుకు వచ్చారు-?

జీవా:- నిన్ను చూడడానికి! కొంచెం భయపడినట్లున్నావే! భయపడవలసిన విషయమే! అయినా అరవవద్దు. నాతోపాటు పిస్తోలు వుంది. నీ దొంగలముఠా చస్తారే కాని, యింకేమీ చేయలేరు.

[షోడశి మెదలకుండా నిలుచునివుంటుంది]

జీవా:- అయినా తలుపు గడియవేస్తే నిశ్చింతగా వుండవచ్చు. ఏమంటావు-?

[తలుపు గడియ వేస్తాడు]

షోడశి:- [వణకుతున్న కంఠంతో] సాగర్ లేడా-?

జీవా:- లేడూ-? ఎక్కడికి వెళ్ళాడు వెధవ-?

షోడశి:- మీ కంతా తెలుసు-కాబట్టే-

జీవా:- తెలుసు కాబట్టే-? కాని, 'మీరంతా' అంటున్నావు. అదేమిటో నాకర్థంకాకుండావుంది.

షోడశి:- నిషేధం గ్రామం చర్చియురాలిననేకదూ, నామీద అత్యాచారం

చేసేందుకు మనుష్యులతో వచ్చారు? కాని, నేను మీకు చేసిన అపకారమేమిటి-?

జీవా:- మనుష్యులను తీసుకుని అత్యాచారం చేయడానికి వచ్చానా? నీ మీదనా-? నీమీద ఒట్టు. అదేమీ కాదు మనసెలాగోవున్నందువల్ల నిన్ను చూదామని వచ్చాను.

[షోడశి కళ్ళంట నీళ్ళు కారుతూవుంటయ్. ఈ పరిహాసంతో అవి ఎండిపోతాయ్. జీవానందుడు దగ్గర్లో కూచుని, వొంచుకొనివున్న ఆమె ముఖంవేపు లుబ్ధ తృషితదృష్టితో చూస్తూంటాడు]

జీవా:- అలకా-!

షోడశి:- చెప్పండి.

జీవా:- ఇక్కడ పొగాకు - గిగాకు ఏర్పాటేమీ లేదనుకుంటాను.

షోడశి:- [ఒక్కసారి తలెత్తి చూచి, మళ్ళీ వంచుకుంటుంది]

జీవా:- [దీర్ఘంగా నిట్టూర్పు విడిచి] వ్రజేశ్వరుని అదృష్టం పండిపోయింది. దేవీ చౌధరాణీ అతన్ని పట్టుకుని పిలిపించి, మంచి సుగంధమైన పొగాకుతో హుక్కా నింపి యిచ్చింది. భోజనాలయాక, దక్షిణకూడా యిచ్చింది. ఇంతకూ బంకింబాబు 'దేవీచౌధరాణి' అనే నవల చదివావా-లేదా-?

షోడశి:- మిమ్మల్నికూడా పట్టుకుని పిలిపించినట్లయితే అటువంటి ఏర్పాటే చేసేదాన్నేమో!

జీవా:- [నవ్వి] అది నిజమే. అందరూ నన్ను బయటకు

లాగాలనే చూస్తున్నారు. తమ భటులను పంపి భోజపురంనుంచి కట్టివేసి తీసుకొని రావాలని అంతా చూస్తున్నారు. అయినా – కంటికి కనుపించని ఆ భటుడు... ఏం అలకా! నీ శాస్త్రంలో అతన్ని ఏమంటారు–? మన్మధుడు కదూ–? అతను. భలే వాడులే–! [క్షణం నీరసంగా వుండి] ఎంతో బలవంత పెట్టాడు. నీ అనుచరులకు సంగతి తెలిసినట్లయితే అల్లుడుకు చెయ్యవలసిన మర్యాదలుకూడా చేయరు. పైగా అత్తవారింటికి వచ్చాననంటే, ఆ మాట అసలే వొప్పుకోరు. ప్రాణాలమీదున్న ఆశవల్ల అబద్ధం చెబుతున్నాడని అనుకుంటారు.

[సిగ్గుతో షోడశి ముఖం వంచుకుంటుంది]

జీవా:– పొగాకు పొగ కడుపులోనికి పోకపోయినా పరవా లేదు. కాని, అటువంటిదే ఏదైనా కడుపులోకి వెళ్ళ కుంటే నిలువడం కష్టం. నిజంగా యింట్లో ఏమీ లేదా అలకా–?

షోడశి:– ఏమైనా అంటే సారాయా–?

జీవా:– [నవ్వి తలూపుతూ] పొరపాటు. దానికి వేరె మనుష్యు లున్నారు. నువ్వుకాదు. నన్ను నేను తెలుసుకునేందుకు అవకాశం కల్పించావు. నే నెన్ని చెడుపనులుచేసినా ఒకరిమీద అపవాదు వేయను. అందువల్ల నిన్ను కోరవలసినవస్తువు ఏదైనావుంటే, అది మనిషినిబ్రతికించేదైతేనే అడుగుతాను. పప్పా–

అన్నం-మిఠాయి-అటుకులు-ఏదివుంటే అది. ఆకలితో
కడుపు మాడిపోతూంది. లేవా-?

[షోడశి రెప్ప వాల్చకుండా చూస్తూ ప్రశ్నించింది]

జీవా:- ఇవాళ ఉదయం మనసేమీ బావుండలేదు. నా శరీర
స్థితి చెపితే పరిహాసంగా వుంటుంది. ఎందుకంటే
ఆరోగ్యమంటే ఏమిటో నే నెరుగను. ఉదయమే నది
వొడ్డుకు షికారుగా వెళ్ళాను. ఎంతదూరం నడిచి
వెళ్ళానో చెప్పలేను. తిరిగివద్దామని బుద్ధిపుట్టలేదు.
సూర్యుడు అస్తమించాడు. అయినా - సిటికిదగ్గరగా
నిలుచుంటే ఎలావుందో నీకేమని చెప్పను? అప్పుడు
నువ్వు జ్ఞాపకం వచ్చావు. కచ్చేరీలో చాలామంది
పోగై వుంటారు. మరి నిన్ను సాగనంపాలికదూ. తిరిగి
వచ్చి సభలో కూచున్నాను. అక్కడ వుండలేక
పోయాను ఏదో నెపంమీద బయటికివచ్చి ఆ చెట్టు
క్రింద నిలుచున్నాను.

షోడశి:- ఆ తరువాత...?

జీవా:- తీరా యిక్కడకి వచ్చిచూస్తే - సాగర్ - నువ్వూ
మాట్లాడుకుంటున్నారు. మాటలన్నీ విన్నాను. అర్థం
చేసుకోవడానికట్టే కాలంపట్టలేదు. మాబోటి సాధు
వ్యక్తులు, యీ నిర్భీద భైరవిని వూడబెరకడంమంచిదే
నని ఆలోచించాను. ఆనాటిరాత్రి పోలీసులు బేడీలు
తీసుకునివచ్చి యింటిని ముట్టడించారు. నీ నోటితో
అసలుసంగతి చెప్పించాలని మెజిస్ట్రేటు ఎంతగానో
ప్రయత్నించాడు. కాని, నువ్వు నా యిష్టప్రకారమే

వచ్చాను అని చెప్పావు. ఇవాళ సాగర్ ఒక చిన్న అనుజ్ఞ యివ్వమని ప్రార్థించాడు. కాని, ఆమాట కలలోకూడా తలచవద్దని చెప్పావు. అతను అభిమాన పడి కోపంగా వెళ్ళిపోయాడు. ఇది నా కళ్ళార చూశాను. మనసులోనే సాష్టాంగపడి నమస్కరించి– చండీగడపు చండీమాతకు జై! నీ యీ అధమ సంతానంమీద ఎంతదయలేకుంటే నువు మాటి మాటికీ యీమె బుద్ధిని పోగొడుతున్నావు? ఇక ఒక్కసారి యీమెను పంపించి నన్ను గద్దె ఎక్కించవమ్మా! జనార్ధన – నందీశులతో నీ పూజకు వస్తాను. ఒక్కనాటి పూజకే నీ మట్టివిగ్రహం రాతివిగ్రహంగా మారిపోతుంది. ఇటు భక్తితత్వాలు ఆ తరువాత చూదాం. ముందు కడుపులో మండిపోతూంది. దాన్ని చల్లార్చు. నిజంగా నీవద్ద ఏమీలేదా అలకా?

షోడశి:– కాని యింటికివెళ్ళి హాయిగా తినవచ్చుగా?

జీవా:- అంటే, నాయింటి సంగతి నాకంటే నీ కెక్కువ తెలుసన్నమాట...? [నవ్వుతాడు]

షోడశి:- మీరు పగలంతా భోజనం చేయలేదు. అటువం టప్పుడు యింట్లో మంచిఏర్పాట్లు చేయకండా వుంటారా?

జీవా.- నేను భోజనం చేయలేదని, వుపవాసంచేసి, వడ్డించిన పళ్ళాన్ని ముందుపెట్టుకుని కూచునేవాళ్ళెవరూలేరు. పైగా ఎవరిమీద కోపం చూపమంటావు అలకా? [మెల్లగా నవ్వుతాడు] ఆనాడు నా శాంతిప్రియమైన

జీవితయాత్ర చూచేవచ్చావు. బహుశా మర్చిపో యావా ? అయితే వెళ్ళమంటావా—?

షోడశి:— [వ్యాకులకంఠంతో] కొంచంగా దేవిప్రసాదంవుంది. దాన్ని మీరు తినగలరా ?

జీవా:— సంతోషంగా తినగలను. కొంచం మామూలు ప్రసాదమా ? అయితే నీకోసమే తెచ్చుకున్నావన్న మాట ?

షోడశి:— లేకుంటే మీకోసం తెచ్చివుంచాననుకున్నారా ?

జీవా:— [నవ్వుతూ] లేదు. అనుకోలేదు. కాని, నిన్ను అన్యాయం చేసినట్లవుతుందేమో !

షోడశి:— అందుకంత విచారించవలసిన పనిలేదు ఇదేమీ కొత్త అన్యాయముకాదు.

జీవా:— అవును ! ఇప్పుడు అన్యాయాలు నన్నేమీ చేయవు. నేనిప్పుడు వాటిని దాటిపోయాను. కాని, అకస్మాత్తుగా నాకొక్క ఆశ్చర్యమైన తిక్కనచ్చిపడింది. నవ్వకుండా వుంటే చెపుతాను.

షోడశి:— చెప్పండి !

జీవా:— నేను తలుచుకుంటే, యిప్పటికైనా మనిషిలా బ్రతక గలను. నా యీ పాపిష్టుని భారం నువ్వే మోయ గలవు. మోయగలవా అలకా ?

షోడశి:— మీరు ఏమంటున్నారు ?

జీవా:— నా సమస్తభారం నువ్వే మోయాలి అలకా ?

షోడశి:— [ప్రఫుల్లివశి] అంటే, మీ కచేరిలో విచారణకు వచ్చిన నా కళంకగాథను నేనే పూరిచేయాలన,

మాట? మా అమ్మను మోసపుచ్చగలరు. కాని, నన్ను మోసపుచ్చలేరు.

జీవా:- అటువంటి ప్రయత్నం నేనెప్పుడూ చేయలేదు అలకా! నిన్ను విచారించాను కాని నాకు అందులో నమ్మకం లేదు. మాటిమాటికీ 'యీ కఠోరమయి రమణిని అభిభూతురాలిగా చేసిన పురుషు డెవరా' అనిఆలో చిస్తుంటాను.

షోడశి:- [విస్మయంతో] అయితే వాళ్ళు మీ కతనిపేరు చెప్పలేదా ?

జీవా:- లేదు. నేను ఎన్నోమార్లు అడిగినా - వాళ్ళు మెదల కుండా పూరుకున్నారు. సరే, ఆ విషయం పోనీయ్. ఇక నేను వెళతాను. ఏముంటావు ?

షోడశి:- ఇంతకూ మీరు వచ్చిన పనేమిటో చెప్పారుకాదు.

జీవా:- పనిసంగతా ? ఆ సంగతి నా కిప్పుడు జ్ఞాపకంలేదు. నీతో మాట్లాడడమే నా పని. ఇదే జ్ఞాపకం వస్తూంది అలకా! నిజంగా నీకు మళ్ళీ పెళ్ళయిందా?

షోడశి:- మళ్ళీ ఏమిటి-? నాకు పెళ్ళయింది ఒక్కమారే!

జీవా:- ఒకసారి మీఅమ్మ నిన్నునాకర్పించినమాట నిజం కాదా-?

షోడశి:- కాదు. అది నిజంకాదు. మా అమ్మ నాతోపాటు మీకిచ్చిన డబ్బుమాత్రమే పుచ్చుకున్నారు. నన్ను స్వీకరించలేదు. మోసంతప్ప అందులో ఏమీలేదు.

జీవా:- [కొంచంసేపు ఆలోచనల్లో నిమగ్నుడై, ఎంతో

దూరంనుంచి మాట్లాడినవాడిలా] అలకా—! నీవన్నది
నిజంకాదు.

షోడశి:— ఏమిటది—?

జీవా:— నువ్వు వూహించింది. ఆ కథంతా ఎవరికీ చెప్పకూడ
దనుకున్నాను. అది నీకే చెప్పవలసివస్తుందనుకోలేదు.
మీ అమ్మను మోసగించాను. కాని, నిన్ను
మోసపుచ్చ గలిగినంత సామర్థ్యం భగవంతుడు నాకు
ప్రసాదించలేదు. నా విన్నపం ఒకటుంది. చెప్ప
మంటావా—?

షోడశి:— చెప్పండి—!

జీవా:— నేను సత్యవాదినికాను. కాని, ఇప్పుడు నేను చెప్ప
బోయేది నువ్వు నమ్మాలి. మీ అమ్మను నే నెరుగు
దును. ఆమె బిడ్డను భార్యగా స్వీకరిద్దామనే వుద్దేశ్యం
నాకు లేదు. నా లక్ష్యమంతా ఆమె డబ్బుమీదే
వుంది. అయినా ఆనాటి రాత్రి మన చేతులు కలిసిన
తరువాత నిన్ను విడిచిపెట్టాలని అనుకోలేదు.

షోడశి:— మరి యేమనుకున్నారు—?

జీవా:— పోనీలే; అసంగతంగా నువ్వు వినాలని కోరవద్దు.
బహుశా చివరవరకూ విన్నాక నీకే తెలుస్తుంది అలా
తెలుసుకోవడంలో నష్టంకంటే లాభంలేదు. నావిష
యంలో నేను నీకు చెప్పినదంతా అబద్ధమే—! నేను
నిన్ను వదిలి పెట్టి పారిపోలేదు.

షోడశి:— ఆ కథకూడా బాగా చెప్పండి—!

జీవా:— నేను తెలుపుతున్నంత దద్దమ్మనుకాను, ఒకవేళ చెప్ప

దల్చుకున్నట్లయితే దాని పరిణామము తెలుసుకునే చెప్పగలను. మీఅమ్మగారి మాటలు నేనెందుకు ఒప్పుకున్నానో ఎరుగుదువా—! నేను ఒకామె హారం దొంగిలించాను. డబ్బిచ్చి ఆమెను శాంతపరుద్దామను కున్నాను. ఆమె శాంతించింది. కాని, పోలీసువారంటు మాత్రం శాంతించలేదు. ఆరు నెలలు జైలుకు వెళ్లాను.

షోడశి:— [పూర్తిగ బిగబట్టి] ఆతరువాత—?

జీవా:— [నవ్వి] ఆతరువాత నా గతికూడా అంతమంచిదికాదు. జీవానందబాబు పేరుమీద యింకొక వారంటువుంది. కొన్ని నెలలక్రితం, రైలుప్రయాణంలో నా సహయా త్రికుని ట్రంకు కాజేసి పరారయాను. అందుకని ఒక టిన్నర సంవత్సరం జైలుశిక్ష—! అంతా కలుపుకుని రెండుసంవత్సరాలు అజ్ఞాతంలోవుండి, చివరకు బీజ గ్రామపు భావిజమీందారు రంగస్థలంమీదకు పునః ప్రవేశించేసరికి, అలకగానీ, ఆమె తల్లిగానీ కనిపించ లేదు.

[ఇద్దరూ కొంచెంసేపు నిశ్శబ్దంగా వుంటారు.]

జీవా:— ఇంకొకమారు సభకు వెళ్ళాలి వెళుతున్నాను అలకా—!

షోడశి:— సభలో మీకు చాలాపనుంది. వెళ్ళకుంటే జరగ దనుకుంటాను. మీరు ఏమీ తినకుండా వెళ్ళలేరు.

జీవా:— వెళ్ళలేనా—? అయితే పట్టుకురా—! నాకు మహాచెడ్డ అలవాటుంది. తిన్నానంటే కదలలేను.

షోడశి:— వెళ్ళకుంటే విశ్రాంతి తీసుకోండి—!

జీవా:- విశ్రాంతి తీసుకోనా-? ఒకవేళ నిద్రపోతేనో-?

షోడశి:- [నవ్వి] అలాసంభవించవచ్చు. కొంపతీసి ఎక్కడి కన్నా పారిపోకండి! నేనుమీకు ప్రసాదం పట్టుకుని వస్తాను. [షోడశి వెళ్ళిపోతుంది.]

[గదిలో ఒకమూల సగం వృత్తరం రాసిన కాగితపు ముక్కమీద జీవానందుని దృష్టి పడుతుంది. దాన్నితీసుకుని చదువుతాడు. అతని ముఖంలో క్షణంక్రితంవున్న సరళత్వం పోయి, కళవం ప్రవేశిస్తుంది. షోడశి భోజనపు పళ్లెంతీసుకుని ప్రవేశిస్తుంది. పీటవేయలేదని ఆమెకు గుర్తుకొస్తుంది. అందు వల్ల తొందర తొందరగా ఆమె భోజనపాత్రను ప్రక్కగా వుంచి, ఒక కంబళిని రెండుమూడు మడతలు గాచేసి, పరిచి దానిమీద ఒక తెల్లని గుడ్డపరుస్తూంటుంది.]

జీవా:- ఏమిటి చేస్తున్నావు?

షోడశి:- మీరు కూచునేందుకు చోటు చేస్తున్నాను. ఒక్క కంబళే అయితే గుచ్చుకుంటుంది.

జీవా:- గుచ్చుకుంటుంది. అయినా-అతిథిసార్యాద అంతకన్నా ఎక్కువ బాధిస్తుంది. ఆతిథ్యంఅంటే చాలా సన్మో హించదగిందే-! అది బూటకమైనదైతే అందులో సమ్మోదమూవుండదు రుచీవుండదు. దీన్ని యింకొక రికి అట్టేపెట్టు-?

[షోడశి నిష్క్రాంత పోతుంది.]

జీవా:- [చేతిలోని కాగితాన్ని చూపించి] సగంచింపేసిన వుత్తరం పూర్తిగాలేదు. దీన్ని ఎవరికి రాసావో వారిపేరు అడగవచ్చునా?

షోడశి:- ఎవరి పేరు?

జీవా:- రాక్షసుని పరిమార్చేందుకు చండీగర్భంలో అవత రించబోయేవారు. ద్రౌపది ప్రియసఖుడు... యింకా చెప్పమంటావా ?

[ఈ వ్యంగ్యానికి షోడశి జవాబు చెప్పదు. అయినా ఆమె కళ్ళలో క్షణం క్రితమున్న మోహాపోరలు వూడి పోతయ్]

జీవా:- ఈ ఆహ్వాన పత్రంలోని ప్రతిపంక్తీ ఎవరి చెవుల్లో అమృతం వర్షిస్తుందో వారి పేరు...?

షోడశి:- [సంబాళించుకుని] వారిపేరు మీకు అవసరమా ?

జీవా:- ఎందుకవుసరంలేదు? ముందే తెలుసుకునివుంటే ఆత్మ రక్షణ కోసం ఎదో ఒక వుపాయం వెదుక్కుంటాను.

షోడశి:- ఆత్మ రక్షణావశ్యకత మీ ఒక్కరికే కాదు, చౌదరి గారూ! నాకూ అవుసరమే!

జీవా:- ఎందుకవుసరంలేదు ?

షోడశి:- అయితే మీరతని పేరు వినలేరు. ఎందుకంటే, మీ నా- ఆత్మ రక్షణోపాయాలు వేరుగావుండవు.

జీవా:- మంచిది. అలాకాకండా వుంటే ఆత్మరక్షణనాకు అవు సరము. అందుకేమీ లోపంరానీయను. తెలుసుకో.

[షోడశి మాట్లాడదు.]

జీవా:- నువ్వు జవాబు చెప్పక పోయినా- నీ వీర పురుషు డెవరో నాకు తెలయక పోలేదు.

షోడశి:- ఎందుకు తెలియదు. ప్రపంచంలోని వీరపురుషు లంతా ఒకరితో ఒకరు పరిచయమయే వుంటారు ?

జీవా:- అదినిజమే ! అయినా యీ కాపురుషుని అవమానించే భారం, నీ వీరపురుషుడు వహించినప్పుడు కదూ? సరే గానీ- యీ వృత్తాన్ని చించేశా వెందుకు ?

షోడశి:- దానికి కారణం నేను చెప్పను.

జీవా:- దీన్ని తిన్నగా నిర్మలబాబుకు రాయకుండా, ఆయన భార్యకు ఎందుకని రాశావు? ఈ శబ్దభేది బాణపద ప్రయోగం ఆయన నేర్పినదేనా-?

షోడ:- ఆ తరువాత ?

జీవా:- ఆ తరువాత నాకున్న సందేహాలన్నీ తీరిపోతూన్నయ్! ఈ మిత్రుని సంగతి యితరులవల్ల విన్నాను. కాని, రాయ్ గారిని ఎంత అడిగినా చెప్పలేదు. అందరికన్నా ఆయన కెందుకంత ఆక్రోశమో గ్రహించాను.

షోడశి:- [తుళ్ళిపడి] నిర్మలబాబు విషయంలో మీ రేమి విన్నారు.

జీవా:- అంతా! నీ త్రుళ్ళిపాటుకూ- నీ వణకుతున్న కంఠ స్వరానికి నాకు నవ్వురావలసింది. కాని, నవ్వలేక పోతున్నాను. అదే నాకు సంతోషము. ఆ నాటిరాత్రి తుఫానులో ఆయన చేయిపుచ్చుకుని యింటికి చేర్చ డం నీకు గుర్తుందా ! అదొక సాక్ష్యం ! మామగారికి కనుపించకుండా అక్కడక్కడా తిరగడం రెండో సాక్ష్యం. నేను రైలులో ట్రంకు కాజేసి నప్పుడు కూడా ఎవరూ చూడ లేదనుకున్నాను.

షోడశి:- అయితే - నిజంగా అలా చేసినట్లయితే, అది దోషమంటారా ?

జీవా:- కాకపోతే దాచి పెట్టేందుకు ప్రయత్న మెందుకు? ఈ వృత్తరపు ముక్క సంగతేమిటి? ఏమని వ్రాస్తోందో స్వయంగా నువ్వే చదువుకుని చూడు? నాలాగే పీడు కూడా ఒకప్పుడు నిన్ను విచారించేందుకు చూశారు కదూ? నిన్ను విచారించేందుకు కొంత జంకు కలుగు తూంది.

[జీవానందుడు చిరునవ్వు నవ్వుతాడు షోడశి నిరుత్తరంగా వుంటుంది.]

జీవా:- దీన్ని నాతో పాటు తీసుకుని వెళ్తాను. అవసరంవచ్చి నప్పుడు నీ యొద్దకు పంపుతాను. యీ కొద్ది పంక్తులు మా కోటి పురుషుల కళ్ళనే మోసపుచ్చక పోయి నప్పుడు హైమవతి కళ్ళనుకూడా తెరిపించగలవు.

[షోడశి నిరుత్తరంగా వుంటుంది.]

జీవా:- ఏమంటావు. చాలా సంగతులు తెలుసు కున్నాను కదూ?

షోడశి:- అవును.

జీవా:- అయితే అన్నీ నిజమే కదూ?

షోడశి:- అవును. నిజమే!

జీవా:- బాధపడుతూ] ఉఫ్ ! నిజమే! [మిణుకు మిణుకు మంటున్న దీపాన్ని కాస్త పెద్దదిచేసి, షోడశి ముఖాన్ని తీక్షణంగా చూసి-] -అయితే యిప్పుడేం చేస్తావు?

షోడశి:- ఏమి చేయమంటారో చెప్పండి!

జీవా:- [కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండి, దీపాన్ని యింకా

పెద్దదిగాచేశీ] అయితే వీళ్ళంతా నిన్ను కళం కినిగా——

షోడశి:— నేను వాళ్ళకివిరుద్ధంగా మీకు ఫిర్యాదు చేయలేదు. నేనేమి చేయాలో అదిమాత్రం చెప్పండి. కారణం చూపించవలసిన అవుసరం లేదు.

జీవా:— అది నిజమే! అయినా—వీళ్ళంతా అబద్ధం చెప్పు తున్నారనీ, నువ్వే సత్యవాది వన్నమాట.

[షోడశి నిరుత్తరంగా వుంటుంది]

జీవా:— జవాబుకూడా చెప్పవా ?

షోడశి:— [తలూపుతూ] చెప్పను.

జీవా:— ఆ వివరమంతా నాతో చెప్పడంకన్నా, నిందను భరించడమే మంచిగా కన్పిస్తున్నదన్నమాట. సరే, ఇప్పుడంతా స్పష్టంగా తెలిసిపోయింది. [వ్యంగ్యంగా నవ్వుతాడు.]

షోడశి:— స్పష్టంగా తెలుసుకున్నారు. అయితే నన్నేమిచేయ మంటారో అదిమాత్రం చెప్పండి!

[ఈ జవాబుతో జీవానందునికోపం ఎక్కువవుతుంది]

జీవా:— చేయవలసిందేమిటో నీకే తెలుసు! అయినా – నేను దేవాలయపు పవిత్రతను కాపాడాలి. దీని యథార్థమైన అభిభావకుణ్ని నేనుగాని నువ్వుకాదు. అదివరకేమి జరిగిందో నాకు తెలియదు. కాని, ఇప్పటినుంచీ 'భైరవి' భైరవిలాగే వుండాలి. లేకుంటే వెళ్ళి పోవాలి.

షోడశి:— మంచిది. అలాగేలెండి! యథార్థమైన అభిభావకు

ఊవడో ఆ విషయం నేను తర్కించను. నేను వెళ్ళి పోతే మందిరం బాగుపడుతుందని మీరనుకుంటే, నేను వెళ్ళిపోతాను.

జీవా:- నువ్వు వెళ్ళడమే మంచిది. నేనుకూడా ఆ ఏర్పాటే చేస్తాను.

షోడశి:- మీ కెందుకంత కోపం! నేను వెళ్ళిపోతాను. అయినా గుడి భారమంతా మీ కే పుచ్చుకోవాలి.

జీవా:- ఎప్పుడు వెళతావు?

షోడశి:- మీరనుజ్ఞ యిచ్చినప్పుడు. ఇవాళ – రేపు – లేదా ఇప్పుడే—!

జీవా:- మరి నిర్మలబాబో?

షోడశి:- ఆయన పేరెత్తకండి!

జీవా:- అతని పేరు నానోటితో ఉచ్చరించటంకూడా విన లేవన్న మాట? మంచిది. మరి నీకు ఎంత కావాలి?

షోడశి:- నాకేమీ అక్కరలేదు.

జీవా:- ఈ యిల్లుకూడా వదిలిపెట్టాలి తెలుసా? ఇదికూడా దేవత సంపదలోనిదే!

షోడశి:- తెలుసు! వీలుంటే రేపే వదిలిపెడతాను.

జీవా:- ఎక్కడికి వెళ్ళాలనుకున్నావు?

షోడశి:- ఇక్కడమాత్రం వుండను. అంతే. అంతకుమించి ఏమీ నిర్ణయించుకోలేదు. ఒకనాడు ఏమీ తెలుసుకోకుండా భైరవినయాను. ఇప్పుడు వెళ్ళబోతూన్న సమయంలో అంతకంటే ఎక్కువ ఏమీ ఆలోచించను. మీరు ఈ వూరికి జమీందారులు. చంద్ర

గడపు మంచిచెడ్డ మీామీాదపెట్టి వెళుతున్నాను. నాకేమీా సంకోచంలేదు. కాని, మా తండ్రి పిరికి వాడు. అతన్నినమ్మి మీారుమాత్రం నిశ్చింతగా వుండకండి.

జీవా:- ఇంతకూ నువ్వు నిజంగా వెళ్ళిపోతావా ఏమిటి?

షోడశి:- అదీగాక బీదవాళ్ళూ - దుఃఖితులైన నా రైతు ప్రజలు వున్నారు. ఒకప్పుడు వాళ్ళకు అంతావుంది. ఇవాళ నారలాంటి నిస్సాయులూ, నిరూపాయులు యింకెవరూ వుండరు. తప్పు చేయనిదే దొంగలని వాళ్ళను జెయిలుకు పంపుతారు వాళ్ళ సుఖదుఃఖ భారాలుకూడా మీామీాదనే పెడుతున్నాను.

జీవా:- మంచిది. వాళ్ళకు ఏంకావాలి?

షోడశి:- ఆ సంగతి వాళ్ళే చెప్పుతారు. [బయటికి తొంగి చూస్తుంది. ప్రాంటి దండెంమీాదనుంచి దోవతి తుండు గుడ్డ తీసుకుంటుంది.]

షోడశి:- నేను స్నానానికివెళ్ళే వేళయింది

జీవా:- స్నానానికా? ఇంత రాత్రప్పుడా?

షోడశి:- ఇంకెక్కడి రాత్రి? మీారు యింటికివెళ్ళండి!

[వెళ్ళిపోవడాని కుపక్రమిస్తుంది.]

జీవా :- [వ్యగ్రకంఠంతో] కాని, ఇంకా చాలాసంగతులు మాట్లాడాలి.

షోడశి:- వాటిని అలావుంచి - మీారు యింటికివెళ్ళండి.

జీవా!- కాదు. నే నెక్కడో పెద్దపొరపాటు చేశాను అలకా. నా మాటలు పూర్తికానిదే—!

షోడశి:— కాదు. మీరింటికి వెళ్లండి. నాకు చాలా నష్టం కలుగచేశారు ఇక మీవల్ల నా జీవితాన్ని నాశనం కానీయను.

జీవా.— సరే. వెళుతున్నాను అలకా. [వెళ్ళిపోతాడు.]

౩వ దృశ్యం. షోడశి కుటీరం.

[నిర్మలుడు ప్రవేశిస్తాడు.]

షోడశి:— ఇదేమిటి నిర్మలబాబూ—? రాత్రి మూడోజామున హఠాత్తుగా యిలావచ్చారేం—?

నిర్మలు:— [నిరుత్తరంగా నిలుచుంటాడు.]

షోడశి:— [నవ్వి] అదా సంగతి—? వెళ్ళబోయేముందు ఒక సారి రహస్యంగా చూడాలని వచ్చారుకదూ—?

నిర్మలు:— మీకు అంతర్యంలోని విషయంకూడా తెలుసను కుంటాను—?

షోడశి:— లేకుంటే ఈ భైరవత్వం ఎలానిర్వహిస్తున్నా నను కున్నారు నిర్మలబాబూ—? అయినా యిక్కడ వెలుతురులేదు పదండి, ఆ గదిలో కూచుందాం—?

నిర్మలు:— ఇంతరాత్రప్పుడు నన్ను వొంటరిగా గదిలోనికి తీసుకుని వెళ్తావా—? నీసాహసం తక్కువైనదికాదు.

షోడశి:— ఆనాటిరాత్రి చీకటిలో మీచెయ్యి పుచ్చుకుని, నది దాటించి యింటికి చేర్చినప్పుడు మీకు భయమనిపించిందా ఏమిటి—? ఆనాడుకూడా వొంటరివారేగా—?

నిర్మలు:— నిజంగా మీ సాహసానికి అంతులేదు.

షోడశి;— అంతెలావుంటుంది, నిర్మలబాబూ—? భైరవినికదూ? రాండి, లోపలికిరాండి—.

నిర్మలు:- లేదు. ఇప్పుడు లోపలికిరాలేను. నేను వెళ్ళాలి.
షోడశి:- అయితే యిక్కడే కూచోండి-?

[ఇద్దరూ కూచుంటారు.]

షోడశి:- అయితే మరి ఇవాళ వెళ్ళాలనుకున్నారుగా-?
నిర్మలు:- ఇవాళ ప్రయాణం ఆపుకున్నాం. రాత్రి యింటికి వెళ్ళక ఇవాళ సాయంత్రం గుడిలో నీవిషయంతేలు స్తారని విన్నాను. ఆ సభలో నేనుకూడా వుండాలను కున్నాను.
షోడశి:- ఎందుకని-? కుతూహలంచేతనా - లేక నన్ను రక్షిం చాలనుకున్నారా ?
నిర్మలు:- పీలున్నంతవరకు అందుకోసమే ప్రయత్నిస్తాను.
షోడశి:- ఒకవేళ ఏదైనా హానిగానీ, కష్టంగానీ, మీ మామ గారితో పోట్లాట సంభవించినప్పటికీనా-?
నిర్మలు:- అవును. ఏది ఎలాజరిగినప్పటికీ...!

[షోడశి నవ్వుతుంది.]

నిర్మలు:- మీరేదో నవ్వేశారు. విశ్వాసం కలగడంలేదా?
షోడశి:- కలుగుతూనేవుంది కాని, యింకొకవిషయానికి నవ్వు తున్నాను. ఇంతకు పూర్వమున్న భైరవిలంతా పర దేశ ప్రజలను గొర్రెలవలే చూచేవారట. సరే, ఆ గొర్రెలతో ఏమిచేసేవాళ్ళు నిర్మలబాబూ-? మేపుతూ తలతిప్పేవాళ్ళా? లేక వాటిలో వాటికి పోట్లాడించి తమాషా చూసేవాళ్ళా-? [పసిపిల్లలా గట్టిగా నవ్వుతుంది.]
నిర్మల్:- [ఆనవ్వులో పాలుపంచుకుని తనుకూడా నవ్వి]

అప్పుడప్పుడు చండీమాతకు బలియిచ్చి ప్రసాదం తినేవాళ్ళు కూడాను.

షోడశి:- అది భయంకరమైన సంగతి నిర్మలబాబూ!

నిర్మలు:- [నవ్వుతూ తలూపి] కాస్తా కూస్తానా-?

షోడశి:- కాస్తా-? అయితే హైమనుకూడా సావధానపర్చు.

నిర్మలు:- దీనర్థం-?

షోడశి:- ప్రతివిషయానికి అర్థం కాస్తోకూస్తోవుంటుంది. [నవ్వి] అతిథి సత్కారం పరిహాసంతో తప్ప. యింకొకవిధంగా ముగించేందుకు నావద్ద ఏమీ లేదు. సరే. యిక అసలు సంగతికి వద్దాం-!

నిర్మలు:- చెప్పండి-!

షోడశి:- [గంభీరంగా] ఇద్దరుమాత్రం దేవతను వంచించాలని చూస్తున్నారు. ఒకరు రాయ్ గారు, రెండోవారు జమీందారు-!

నిర్మలు:- ఇంకొకరు మీతండ్రిగారురూ-!

షోడశి:- తండ్రిగారు-! అవును ఆయనకూడానూ-!

నిర్మలు:- మా మామగారి సంగతి నాకు తెలుసు. మీతండ్రి గారిసంగతి కూడా కొంతవరకు తెలుసుకోవచ్చు. కాని, యీ జమీందారుగారివిషయం ఏమీ అర్థంకాకుండా వుంది. మీతో ఆయనకెందుకింత శత్రుత్వం-!

షోడశి:- దేవత మాన్యాన్ని తనదని చెప్పి అమ్మచూస్తు న్నారు. కాని నేనుండగా అలాజరగడానికి వీలులేదు.

నిర్మలు:- [నవ్వి] అయితే నేను సంభాళించుకోగలను.

షోడశి:— మీరు సంభాళించుకోలేని సంగతులు చాలా వున్నయ్—!

నిర్మలు:— ఏమిటవి—? ఒకటి మీామీాదున్న అబద్ధపు కళంకం—!

షోడశి:— [శాంతస్వరంతో] దానికి నాకేమీా విచారంలేదు. కళంకం నిజమైనా అబద్ధమైనా దానితోనే భైరవి జీవితం మునిగివుంది నిర్మలబాబూ—! ఇదే నేను వాళ్ళకు చెప్పాలనుకున్నాను.

నిర్మలు:— [ఆశ్చర్యపడి] నీ నోటితో అలాఅనటం ని దోషాన్ని అంగీకరించటమే అవుతుంది—!

షోడశి:— కావచ్చు.

నిర్మలు:— కాని వాళ్ళనడం—

షోడశి:— ఎవరనడం—?

నిర్మలు:— చాలామంది అన్నారు. అప్పుడు అంటే మేజస్ట్రేటు గారు వచ్చినరాత్రి మీా వాడిలో—!

షోడశి:— వాళ్ళు చూశారా—? నాకే గుర్తులేదేమా! ఒక వేళ చూసినట్లయితే నిజమే! ఆయన ఆరోగ్య మా నాడు చాలా చెడిపోయింది. నా వాడలో తల పెట్టి పడివున్నారు

నిర్మలు:— [క్షణం నిశ్శబ్దంగావుండి] ఆ తరువాత—?

షోడశి:— ఏదోవిధంగా రోజులు వెళ్లిపోతూన్నయ్! ఆ నాటి నుంచీ నా మనసు ఏ విషయంలోకూడా లగ్నం కావటంలేదు. అంతా మాయలా కనుపిస్తూంది.

నిర్మలు:— మాయ ఏమిటి—?

షోడశి:- అంతా-! ధర్మకర్మలూ, వ్రతాలు, వుపవాసాలూ, భగవత్సేవా-ఇన్నిరోజులనుంచీ చేసిన యీ వనంతా-!
నిర్మలు:- మరి యింకా యీ భైరవిపదవిలోవుండడ మెందుకు?
షోడశి:- అవును. అయినా యీ భైరవితనం వదులుకోమని మీరు చెప్పినట్లయితే-!
నిర్మలు:- కాదు. కాదు. నే నేమీ చెప్పను. సరే, యిక నేను వెళ్తాను. మీ పనులకు భంగం కలిగించాను.
షోడశి:- అతిథి సత్కారం, మిత్రుని మర్యాద చేయడం, యివి పనులు కావా నిర్మలబాబూ-?
నిర్మలు:- తెల్లవారింది ఇక వెళ్ళనా-?
షోడశి:- సరే, వెళ్ళండి! నా స్నానానికికూడా వేళ మించి పోతూంది. నేనుకూడా వెళుతున్నాను.

[ఇద్దరూ నిష్క్రమిస్తారు]
[సాగరుడు, ఫకీరు ప్రవేశిస్తారు]

సాగర్:- లేదు. అలా జరగడానికి వీలులేదు. జరగకూడదు. ఫకీరుగారూ! అంతా వదిలిపెట్టి వెళతానని అమ్మగారంటే అనవచ్చు. నేనుమాత్రం వెళ్ళనీయను..
ఫకీరు:- అలా ఎందుకు జరగడానికి వీల్లేదు సాగర్-?
సాగర్:- అది నాకు తెలియదు. వెళ్ళడానికి వీల్లేదు. ఆమె వెళ్ళినట్లయితే దీనదుఃఖితులైన మాబోటి రైతులు ఎక్కడ నిలుచుంటారు-? బ్రతికే దెలా-?
ఫకీరు:- షోడశి, ఎంతసిగ్గుతో, అసహ్యంతో యివన్నీ వదిలి పెట్టి వెళుతుందో మీరు వినలేదా-?
సాగర్:- విన్నాము. ఆనాటిరాత్రి దొరగారి బారినుంచి

జమీందారు నెందుకు రక్షించిందో ఆ సంగతి అందరి లాగే మమ్మల్నిగూడా ఆశ్చర్యంలో ముంచేసింది. [క్షణంసేపు మెదలకుండావుండి] ఆ సంగతి మేము తెలుసుకున్నా లేకపోయినా, ఆమె మాకు తల్లి లాంటిది. తల్లికి పుట్టిన సంతానమైన మేము ఆమె నేరా లెంచము.

ఫకీరు:-మీకు ఎంచకపోయినా. చండీగఢంలో నేరా లెంచే వాళ్ళు తక్కువవున్నారా సాగర్-?

సాగర్:- అయితే మనుష్యులంటే వాళ్ళేనన్నమాట-? మే మంతా ఆమె సంతానం. మా హృదయపూర్వక మైన విశ్వాసంకంటే, వాళ్ళ బయటినిర్ణయమే న్యాయ మంటరా ఫకీరుగారూ? వాళ్ళసంగతి మే మెరుగనిదా! ఒకప్పుడు మాకున్న సర్వస్వం లాక్కున్నారు వాళ్లు. మేము జెయిలుకు వెళ్ళిందికూడా వాళ్ళ న్యాయబుద్ధి మూలాన్నే.

ఫకీరు:- నా కంతా తెలుసు!

సాగర్:- మీ కన్నిసంగతులు తెలియవు. మామా అల్లుళ్ళం జెయిలుశిక్ష అనుభవించి యింటికి వచ్చాం. మేము 'అమ్మా! మేమంతా చచ్చిపోతున్నాం' అని చెప్పాము. అమ్మగారు కోపంతో - 'మీరంతా దొంగలు. మీరు చనిపోవటమే మంచిది.' అన్నది. మేము కోపంతో యింటికి వచ్చేశాం. మామ- 'భగవంతుడా బీదవాళ్ళ నెవరూ నమ్మరుగదా-!' అన్నాడు. ఆ మరునాడు అమ్మ మమ్మల్ని పిల్చి- 'మీకు చాలా

అన్యాయం చేశాను. నన్ను క్షమించండి! మిమ్మె
ల్నెవరూ నమ్మకపోయినా - నేను నమ్ముతున్నాను.
ఇంకా నావద్ద యిరవై ఎకరాల భూమివుంది. దాన్ని
మీరంతా పంచుకోండి! చండీదేవికి మీరు యివ్వ
గలిగినంత పన్ను యివ్వండి-! కాని, చెడుమార్గాన
మాత్రం నడవకండి. ! ఇదే నా షరతు' అన్నది.

ఫకీరు:- కాని, లోకులనడం—!

సాగరు:- అననీయండి-! మా అమ్మ ఒక్క-దానికి మామీద
నమ్మకముంటే చాలు. మా మూలాన్నే నందీశుడు,
రాయ్‌గారు ఆమెకు విరోధమయారు. అసలు గమ్మత్తు
ఏమంటే, ఎవరిదయచేత వాళ్ళు బ్రతుకుతున్నారో
వాళ్ళకు తెలియదు.

ఫకీరు:- మరి మీరంతా నన్నెందుకు లాక్కొ-చ్చారు-?

సాగర్:- ఎందుకా? మీరు ముసల్మానులైనప్పటికీ, ఆమె
గురువులాంటివారని విన్నాను. మీరు తప్ప ఆ తల్లిని
యింకెవరూ ఆపలేరు.

ఫకీరు:- కాని, యింత అన్యాయమైన నిషేధాన్ని నేనెలా
చేయను సాగర్ ?

సాగర్:- మాబోటి బీదప్రజల మేలుకోసమైనా చేయాలి.

ఫకీరు:- అయినా షోడశి యింట్లో లేదు. చాలా ఆలస్య
మైంది. నేనింకా వుండలేను. వెళ్తున్నాను.

సాగర్:- కొంచెంసేపు ఆగలేరా? మీరామెను ఆపలేరా?
కాని, దీని ప్రతిఫలం సవ్యంగా వుండబోదు.

ఫకీరు:- అటువంటి మాటలు అనకూడదు సాగర్.

సాగర్:- అలా అనకూడదని అమ్మగారుకూడా అంటుండేది. సరే. అనను లెండి! మా మనసులోని విషయం మాలోనే వుంచుకుంటాము. [ఫకీరు నిష్క్రమిస్తారు]

సాగర్:- మీరు సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు. మా దోపిడిగాళ్ళ హృదయాల్లోని అగ్నిని మీరెరుగరు. మా కున్నదంతా పోయింది. ఇక అమ్మగారు కూడా మమ్మల్ని వదిలి వెళ్ళిపోతే మేము బ్రతుకలేము. [నిష్క్రమణ]

[నిర్మలుడు - షోడశి ప్రవేశిస్తారు]

షోడశి:- మిమ్మల్ని వూరికేనే పిలుచుకువచ్చాననుకున్నారా? ఛీ ఛీ. మీరక్కడ నిలుచుని ఏమి వింటున్నారో చెప్పండి! దేవతాశిలలోని సన్నిహితమైన పెరట్లో కొంత మంది పికికివాళ్ళు ప్రోగై. ఇద్దరు అసహాయులైన స్త్రీలను నిందిస్తున్నారు. వాళ్ళలో కూడా ఒకామె చని పోయింది. రెండోవారు అక్కడ లేరు. రాండి. ఇంట్లోకి రాండి!

[గదిలో ఆసనంపరిచి. ఆదర పూర్వకంగా నిర్మలుని కూచోపెట్టి, తనూ అచేరువనే కూచుంటుంది]

షోడశి:- మీరు నా కేసులో వకాల్తా పుచ్చుకున్నారు కదూ.? నిజమేనా?

నిర్మలు:- నిజమే!

షోడశి:- ఎందుకని పుచ్చుకుంటున్నారు.?

నిర్మలు:- బహుశా మీకింటిలో అన్యాయం జరుగుతుందని మాలు.

షోడశి:- అంతేనా...? ఇకేమీ ఆశలేదు కదూ? [నవ్వి] పోనీయండి. అన్నిటికీ జవాబు చెప్పాలని ఏ శాస్త్రం లోనూ లేదు. అందులో యిది జటిలమైన శాస్త్రం కదూ? సరే. దీన్ని వదిలిపెట్టండి! ఈ కేసుభారం మీరు పుచ్చుకున్నారు. ఒకవేళ వోడిపోయినట్లయితే వెనకడుగు వేయరుకదా?

నిర్మలు:- లేదు. అప్పుడుకూడా. వెనకడుగు వేయను.

షోడశి:- ఓహో! ఎంత ఆడంబరమైన పరోపకారం? [నవ్వి] ఒకవేళ నేనే హైమనైవుంటే, ఇటువంటి పరోపకార బుద్ధికి స్వస్తిచెప్పించి వుండేదాన్ని. నేనంత మంచి దాన్ని కాదు. నావద్ద మోసాలు సాగవు. రాత్రిం బగళ్ళు కళ్లలో వత్తులు వేసుకుని చూస్తూంటాను.

నిర్మలు:- [విస్మయ - భయానందాలతో] కళ్ళలో వత్తులు వేసుకున్నంతమాత్రాన ఏమవుతుంది షోడశీ? దీని బంధనం ఎక్కడ ప్రారంభమవుతుందో, దృష్టి అంత దూరం ప్రాకలేదు. ఈ సంగతి నువ్వింతవరకూ తెలుసుకోలేదా?

షోడశి:- ఎందుకు తెలియదు? [నవ్వుతుంది. బయట అడుగుల ధ్వని వినిపిస్తుంది. షోడశి మెడసాగించి చూసి] అదుగో! వారుకూడా వచ్చేశారు.

నిర్మలు:- ఎవరు, ఫకీరుగారా?

షోడశి:- కాదు జమీందారుగారు. సభ అయాక వారిని ఒకసారి పాదధూళి ప్రసాదించి వెళ్లమని అర్థించి వచ్చాను. అది యిచ్చేందుకు వచ్చినట్లున్నారు!

నిర్మలః— [విరక్తితో] అయితే మీరీసంగతి నాతో ఎందుకు చెప్పలేదు ?

షోడశి:— బాగుంది. ఒకసారి 'నువ్వు' మరొకసారి 'తమరు' [నవ్వి] భయపడవలసిన అవసరంలేదు. ఆయనకూడా గొప్పవాడే ! దెబ్బలాడే రకంకాదు. అంతేకాదు. మీకు వారితో పరిచయంలేదు. ఇదికూడా ఒక లాభమే ; [తలుపుదగ్గరకెళ్ళి] రాండి !

జీవా:- [ప్రవేశిస్తూ, హఠాత్తుగా ఆగి] తమరు—? నిర్మల బాబుగా రనుకుంటాను ?

షోడశి:- 'అవును మీకు మిత్రుడ'ని పరిచయం చేయడంలో అత్యుక్తి లేదనుకుంటాను !

జీవా:- [నవ్వి] ఆశ్చర్యమైన సంగతే ! మిత్రుడు కాకుంటే యింకేమనుకున్నావు ? వీరి దయతోనే యింతవరకూ నిలబడి వుండగలిగాను. లేకుంటే మామగారి జమీందారీ దారికేవరకూ నేను చేసినపనులకు, యీ చండీగఢం జెయిల్లో కాకుంటే అండమాను జెయిల్లో వుండేవాణ్ణి.

షోడశి:- చౌదరిగారూ ! బారిష్టరుగారు గొప్పవారని కదూ, మీరు తెగపొగడుతున్నారు. గొప్పగొప్ప నేరాల వల్ల పొందే అండమాన్ జెయిళ్ళమాట అటుంచండి ! చిన్నచిన్న నేరాలకు పొందే యీ దేశపు జెయిళ్లు కూడాఅందంగావుండవు. భైరవి బిడదికాబట్టే కదూ, ఆమెకు ధన్యవాదా లర్పించడంలేదు !

జీవా:- [సిగ్గుపడి] సమయం వచ్చినప్పుడు ధన్యవాదాలు పొందుతావు.

షోడశి:- [నవ్వి] అంటే—ఇప్పుడిప్పుడే సభలో నిలుచుని ధన్యవాదా లర్పించి వచ్చినట్లు. [జీవానందుడు నిశ్శబ్దంగా వుంటాడు.] ఇవాళ నిర్మలబాబు లేకుంటే మీతో బాగా పోట్లాడేదాన్ని. ఛీ. ఈ పని పురుషునికి శోభస్కరమైనదేనా? ఇంతకూ అంత అవుసరమే మొచ్చింది? ఆనాడు యీ యింట్లో కూచుని మీ రేమని ఆజ్ఞాపిస్తారో నేనది చేయడానికి సిద్ధంగా వున్నానని మీతో అన్నాను. మీరు కూడా మీ అభిప్రాయం చెప్పారు. ఇవిగో పెట్టెతాళాలు. ఇదిగో లెక్కల పుస్తకం [పైచెంగునుంచి తాళాలగుత్తి విప్పి, అలమారులోంచి మందపాటి రెండు పుస్తకం తీసి,జీవానందుని పాదాలముందుంచి.] అమ్మవారి కున్న అలంకారాలూ, దస్తావేజులూ అన్నీ పెట్టెలో వుంటాయ్. ఇంకా ఒక కాగితం పెట్టెలో ఆ పత్రం దొరుకుతుంది. అదే నా రాజీనామాపత్రం.

జీవా:- [నమ్మలేక] నువ్వనేదేమిటి? ఇదంతా ఎవరికి వప్ప చెపుతున్నావు?

షోడశి:- అందులోనే రాసివుంది చూచుకోండి.

జీవా:- మరి యీ తాళాలు అతనికే ఎందుకని యివ్వ కూడదు?

షోడశి:- వారికే యిచ్చాను.

జీవా:- [మలినముఖంతో - సందిగ్ధ కంఠంతో] అయినా -

నేను వీటిని తీసుకోలేను షోడశీ! కాతాలో వ్రాసి వున్నదానికి, పెట్టెలో వున్నవాటికి సరిపోతుందనే నమ్మకమేమిటి? నీకు అవుసరమైతే పదిమందిలో వొప్పచెపితే బావుంటుంది.

షోడశి:— [తలూపుతూ] నాకంత అవుసరంలేదు. కాని, చౌదరిగారూ! మీరలాఅంటే నేను వొప్పుకోను. మీరు కళ్ళుమూసుకొని ఆనాడు నా చేతులతో యిచ్చిన విషాన్ని త్రాగారు. ఆచేతులతోనే ఇవాళ తాళాలు యిస్తున్నాను. పుచ్చుకోవడానికి భయపడు తున్నారా? ఆసంగతి నేను వొప్పుకోను. పుచ్చు కోండి. [ఖాతాపుస్తకం, తాళపుగుత్తి తీసి బలవం తంగా జీవానందుని చేతుల్లో పెడుతుంది.]

షోడశి:— ఇవాళ నేను బ్రతికిపోయాను. [కంఠాన్ని కోమ లంగా మార్చి] ఒక్క—భారం మాత్రం మీమీద పెడుతున్నాను. అది నా బీదరైతుల భవిష్యత్తు నేను ఎన్నిమార్లు ప్రయత్నించినా వాళ్ళకు మేలుచేయలేక పోయాను. మీరుమాత్రం తేలికగా చేయగలరు. [నిర్మలునిచూసి] నా మాటల తీరుచూచి మీరు విస్తు పోతున్నట్లున్నారు నిర్మలబాబూ? అంతేనా?

నిర్మలు:— [తలూపుతూ] ఆశ్చర్యమేకాదు. ఒకవిధంగా అభి భూతుణ్ణి యేస్థితికి వచ్చేశాను. భైరవి పదవికి రాజీ నామా పత్రం వ్రాసివుంచినట్లు నాకే మధ్య చెప్పనే లేదే?

షోడశి:— నా విషయంలో చాలాసంగతులు మీతో చెప్ప

లేకపోయాను. కాని, ఎవ్వడో ఒకప్పుడు మీారే తెలుసుకుంటారు. నా విషయంలో క్షుణ్ణంగా తెలుసుకోగలిగినవారు ఒక్క ఫకీరుగారే.

నిర్మలు:- బహుశా. వారే మీాకు సలహా యిచ్చివుంటారు.

షోడశి:- లేదు. వారికింతవరకూ యీా విషయంలో ఏమీా తెలియదు. మీారు దేన్ని ర జీనామాపత్రమని అంటు న్నారో - అది కొద్దిరోజులక్రితమే తయారుచేశాను. నన్ని పనికి పురికొల్పినవారి పేరుమాత్రం రహస్యంగా వుంచగలను.

జీవా.- నన్నింటికిపిలిచి పరిహాసం చేస్తున్నట్టున్నావు షోడశీ; దీన్ని నమ్మడం 'విషం' కన్నా కఠినంగా వుంది.

నిర్మలు:- [న వ్వతూ జీవానందుని వేపు చూసి] మీారుకొన్ని అడుగులు మాత్రమే నడిచివచ్చి, యీా తమాషా చూస్తున్నారు. కాని, నేను పనీ, పాటా - యిల్లూ - వాకిలీ అన్నీ వదిలిపెట్టుకుని వచ్చి తమాషా చూస్తు న్నాను. ఇదే నిజమైనట్లయితే - మీా కోరిక నెర వేరినట్లే. నాకుమాత్రం పదహారు అణాలవంతు నష్టమే సంభవించింది. [షోడశిని వుద్దేశించి] నిజంగా యిది పరిహాసం కాదుకదా ?

షోడశి.- కాదు నిర్మలబాబూ! మీా తల్లీ కూతుళ్ల అపఖ్యాతి దేశమంతా వ్యాపించిపోయింది. ఇది పరిహాసాలాడే సమయమేనా ? నేను నిజంగా అంతా వదిలి పెట్టే స్తున్నాను.

నిర్మలం:- అయితే ఎంతో విచారంలోనే నువ్వీపని చేస్తున్నా

వన్న మాట. బహుశా నేను మిమ్మల్ని రక్షించేవాడి నేమో! మీరలా చేయని ్లేదు. ఎందుకో నేను గ్రహించగలిగాను. ఆస్తి - పాస్తులు రక్షింపబడ వచ్చు కానీ, అందువల్ల కలిగే అపఖ్యాతి ఎక్కువవు తుంది. దాన్ని ఆపేబలం నాలో లేదు. [క్రీగంట జీవా నందునివేపు చూసి] అయితే, మీరిప్పుడేంచేయాలని నిశ్చయించుకున్నారు ?

షోడశి:- ఆ సంగతి మీకు తరువాత చెపుతాను.

నిర్మలు:- ఎక్కడికెళ్ళి వుంటారు ?

షోడశి:- ఆ సంగతికూడా మీకు తరువాత తెలియచేస్తాను.

నిర్మల్ :- [చేతికున్న గడియారం చూసి] పది గంట లైంది. సరే, నేను వెళుతున్నాను ఇక నాతో మీకేమీ అవుసరం లేదనుకుంటాను.

షోడశి:- అంత మూర్ఖంగా నే నెలా చెప్పను నిర్మలబాబు ? అయినా గుడివిషయంలో మాత్రం నేను తమరిని కష్ట పెట్టను.

నిర్మలు:- మమ్మల్ని అంత తొందరగా మరచిపోవని నే మనుకోవచ్చా ?

షోడశి:- [తలూపుతూ] లేదు మర్చిపోను.

నిర్మలు:- మీరంటే హైమకు తగని ప్రేమ. వీలున్నప్పుడల్లా సంగతి సందర్భాలు తెలుసుకుంటూ వుండండి. [వెళ్ళిపోతాడు]

జీవా:- ఈ మనిషిని సరిగ్గా అర్థం చేసుకోలేకుండా వున్నాను.

షోడశి:- అర్థం చేసుకోలేక పోయినా మీాకు నష్టమేమీా లేదు లెండి.

జీవా:- నాకు వుండకపోవచ్చు. నీకువుండవచ్చు. జ్ఞాపకంవుంచు కోమని ఎంత వ్యాకులంగా ప్రార్థించాడో విన్నావా?

షోడిశి:- విన్నాను. నేను వాళ్ళను అర్థంచేసుకున్న దానిలో సగం వాడు నన్నర్థం చేసుకున్నట్లయితే, యింత యిదిగా ప్రార్థించే అవుసరం వుండేదికాదు.

జీవా:- ఓ నర్థం !

షోడశి:- అర్థమా ? చండీగడ భైరవి పదవిని చినిగి గుడ్డపేలికలా వదిలి వెడుతున్నాను. ఈ శిక్షణ ఎవరి దగ్గర నేర్చుకున్నానో ఎరుగుదురా? వీళ్ళవద్దనే. హైమను చూశాక, స్త్రీల కివన్నీ అనవసరమైన పనులని తెలుసు కున్నాను. కాని, ఈ సంగతి వాళ్ళకు తెలవదు.

జీవా:- అయినప్పటికికూడా యింతా ఒక నిగూఢ రహస్యంగానే వుంది. అలకా ! ఒకసంగతి అడగడానికి నాకు సిగ్గేస్తూంది. ఒకవేళ అడిగినట్లయితే, దానికి సరియైన జవాబు చెప్పతావా,?

షోడశి:- [నవ్వి] మీారేదైనా ఒక అద్భుత కార్యం చేసినట్లయితే- నేను ఆశ్చర్యకరమైన పని చేయగలనో-లేదో నాకు తెలియదు. అయినా - మీారు అద్భుతమైన కార్యం చేయవలసిన అవుసరంమాత్రంలేదని తెలుసుకున్నాను. అందరూ కలసి అపనిందవేశారు అది నిజమనని నేను అనుభవించాల్సిందేనంటే, అందులో ఏమీా అర్థంలేదు. ఏ విషయానికికూడా నే నెవరినీ

ఆశ్రయించను. నాకు భర్త వున్నారు. ఏ విధంగా కూడా నే నీ విషయాన్ని మర్చిపోలేను. ఈ భయంకరమైన ప్రశ్నే కదూ మిమ్మల్ని సిగ్గుపడేటట్లు చేస్తూంది చౌదరిగారూ ?

జీవా:- చౌదరిగారని నన్నెందుకు పిలుస్తావు ?

షోడశి:- మరి ఏమనాలి ? ప్రభూ అనమంటారా?

జీవా:- కాదు. నా పేరు జీవానంద బాబు.

షోడశి:- సరే. భవిష్యత్తులో అలాగే పిలుస్తాను. అయినా చాలా రాత్రయింది. మీ యింటికి వెళ్ళడం లేదా? మీ మనుష్యులంతా ఏరి ?

జీవా:- నేను వాళ్ళను యింటికి పంపించాను.

షోడశి:- ఒంటరిగా ఇంటికి వెళ్ళడానికి మీకు భయం కలుగదా?

జీవా:- లేదు. నావద్ద పిస్తోలు వుంది.

షోడశి:- అయితే దాని సహాయంతోనే యింటికి వెళ్ళండి ! నాకు చాలా పనుంది.

జీవా:- నీకు వుంటే వుండవచ్చు నాకు మాత్రం పనేమీ లేదు. నే నిక్కడే వుంటాను.

షోడశి:- [తీవ్రంగా చూసి, అయినా శాంతంగా] నన్ను మనిషిని పిలవమంటారా ? వాడు మిమ్మల్ని యింటి వరకూ పంపించి వస్తాడు.

జీవా:- [సిగ్గుపడి] ఎవరిని పిలవ నవసరం లేదు. నేనే వెళుతున్నాను . అయినా వెళ్ళడానికి నా కిష్టం లేదు. అందుకే నేను వెళ్ళనంటున్నాను. అయితే నువ్వు నిజంగానే చండీగఢం వదలి వెళతావా అలాగా ?

షోడశి:— [తలూపి] అవును.
జీవా:— ఎప్పుడు వెళతావు ?
షోడశి:— ఏమి చెప్పగలను ? బహుశా రేపే వెళతానేమో !
జీవా:— రేపా ? రేపే వెళ్ళగలవా ? [నవ్వుతూ] ఆశ్చర్యం ! మానవుడు తన మనసును తాను తెలుసుకోవడంలో చాలా పొరపాట్లు చేస్తుంటాడు. నువ్వియిక్కడనుంచి వెళ్ళిపోవడానికి నేనెంతో ప్రయత్నించేశాను. ఇప్పుడు నువ్వు వెళ్ళిపోతానంటే, నాకు ప్రపంచమంతా నీరసంగా కనుపిస్తూంది. నిన్ను వెళ్ళగొట్టేసి నప్పుడు నేను అమ్మదలచుకున్న భూమికి అడ్డు చెప్పే వాళ్ళెవరూ వుండరనీ, కొంత డబ్బుకూడా చేతికందుతుందనీ నేనెలా చెపితే అలా నడుచుకుంటావని కూడా ఆలోచించాను కాని, దానికి యింకొక విషయంకూడా తటస్థించింది. నువ్వు సర్వం త్యాగంచేసి, ఆ భారాన్ని నామీద వుంచావు. దాన్ని నేను మోయగలనో లేదో తెలియదు. సరే అలకా ! చాలా నువ్వు కూడా పొరపడి వుండవచ్చు. నీ మనసును నువ్వు కూడా అవగతం చేసుకోలేదేమో ! ఏం జవాబు చెప్పవేం.?
షోడశి:— ఎంత వెదికినా జవాబు దొరకడంలేదు. ఇవన్నీ మీ మాటలేనా అని ఆశ్చర్యం వేస్తుంది.
జీవా:— అయితే, అక్కడ నీకు ఎలా జరుగుతుందో అదన్నా చెపుతావా—?
షోడశి:— ఇదంతా అనవసరమైన కుతూహలం చౌధరిగారూ!

జీవా:- కావచ్చు అలకా, కావచ్చు. అయినా, ఇవాళ నా అవసరాలు - అనవసరాలు నీ కెలా చెప్పి వొప్పించ గలను ?

[బయటనుంచి పూజారి దగ్గుతో పాటు అడుగుల ధ్వని వినిపిస్తుంది. మరుక్షణంలోనే పూజారి ప్రవేశిస్తాడు]

పూజారి:- అమ్మా ! అందరి యెదుటా గుడితాళాలు తారా దాసుగారికి వొప్పగించాను. రాయ్‌గారూ, శిరోమణి మొదలైనవాళ్ళంతా అక్కడే వున్నారు.

షోడశి:- మంచిపని చేశావు. కొంచం సేపు నిలుచుని వుండు. సాగరునిదగ్గరకు వెళ్ళాలి.

జీవా:- అయితే-ఇవన్నీ కూడా రాయ్‌గారి వద్దకు పంపు.

షోడశి - కాదు. పెట్టె, తాళాలు యింకొకరికి యివ్వడం నా కిష్టంలేదు.

జీవా:- అయితే నన్నే నమ్మావా-?

[షోడశి జవాబు చెప్పకుండా జీవానందుని సాష్టాంగ నమస్కరిస్తుంది. తలెత్తి చూసేసరికి పూజారి ఆశ్చర్యపడుతుంటాడు]

షోడశి:- పద నాయనా ! యిక ఆలస్యం చేయకు !

పూజారి:- పదమ్మా ! పద-!

[పూజారి, షోడశి వెళ్ళిపోయాక, జీవానందుడు ఒక్కడే ఆ నిర్మానుష్యమైన గదిలో స్తబ్ధుడై నిలుచుని వుంటాడు.]

## తృ తీ య అం కం

### ప్రథమదృశ్యం—నాట్యమందిరం

[చండీదేవి ఆలయప్రాంగణంలో నాట్యమందిర దృశ్యం - సమయం - మూడుజాములు. శిరోమణి, జనార్దన రాయ్ యింకా గ్రామములోని పెద్దలు కొంతమంది కూచుని వుంటారు.]

శిరో:- [కుడిచేయియెత్తి ఆశీర్వదిస్తూ జనార్దన్ దీర్ఘాయుష్మాన్ మస్తు. బుద్ధిమంతుడవని చెప్పాలంటే ప్రపంచంలో నిన్నే చెప్పాలి.

జనా:- [వంగి పాదాలు ముట్టుకుని] ఈ విషయంలో నిర్మలుని యివాళ చివాట్లు పెట్టవలసి వచ్చింది శిరోమణి గారూ! అందువల్ల మనసేమీ బావుండలేదు.

శిరో:- నిజమే! అయినా, యిది ఒకందుకు మంచిదేఅయింది. మామగారి మాటలు - పెద్దల సూక్తులు వినకుండా తిరిగినట్లయితే జరిగే చెడ్డఫలితం యిప్పటికైనా అతనికి తెలిసివస్తుంది. అసలు జరగవలసిందే అంత! సర్వమంగళమయురాలైన ఆ చండీమాత ఇచ్ఛ-!

జనా:- అంతా ఆ తల్లి యిచ్ఛ. లేకుంటే భైరవి ఏమీ అనకుండా వెళ్ళిపోయేదేనా-?

శిరో:- నిస్సందేహం! గుడి తాళాలు ఎలాగో మనం తీసుకోగలిగాము అయినా - అసలు తాళాలు జమీందారు చేతుల్లో పడ్డాయని విన్నాను అతనేమో త్రాగుబోతు. చివరకు ఆ తల్లి పెట్టెలోని వెండి బంగారమంతా - కల్లుదుకాణంవాడి పెట్టెలోకి వెళ్ళకుండా

చూడాలి. ఆ తరువాత కలిగే పాపానికి అంతే వుండదు.

జనా:- దీన్ని గురించి ఆలోచించనేలేదు.

శిరో:- లేదు. అయినా సహజంగా యిన్నాళ్ళకూ పగేపరి పది రోజులయాక- 'పెట్టెలో ఏమీలేదే-!' అని చెప్పే స్తాడు. షోడశి ఏమిచేసినప్పటికీ, దేవత సొత్తును ముట్టు కోదని మనకు తెలుసు. ఒక్క దమ్మిడీకూడా వొంగి లించదు.

[చాలామంది యీమాటలను వొప్పుకుంటూరు]

ఇంకో పెద్దమనిషి:- ఇతనికంటే ఆమే నయం.

శిరో:- ఆశాశాలు మనకు తొందరగావద్దు ఉపాయం ఆలో చించాలి.

చాలామంది:- అవునవును.

మొదటివాడు:- అయితే మనమంతాకలిసి జమీందారు వద్దకు వెళదాం పదండి. ఆ పెట్టెలో ఏముందో ఏమి లేదో చూడాలని అడుగుదాం-!

రెండోవాడు:- నా అభిప్రాయంకూడా అంతే-!

మొదటివాడు:- పగలు మూడోజామున, ఆయన నిద్రనుంచి లేచి విస్కీ త్రాగాక సంతోషంగా వుంటాడు. ఆ సమయాన మనం వెళదాం-!

అందరూ:- అవునవును. అదేబాగ్వుంది.

శిరో:- [భయపడి] కాని. ఆయన విస్కీ ఎక్కువగా త్రాగి వుంటేనో-! అప్పుడు వెళ్ళడం మంచిదికాదు. నీ అభి ప్రాయ మేమిటి జనార్దన్-?

[అకస్మాత్తుగా అందరూ చాంచల్యులవుతారు. ఒకడు స్వయంగా ప్రభువుగారే వస్తున్నారు. అంటాడు. ఆ మరు క్షణంలోనే జీవానందుడు, ప్రఫుల్లుడు ప్రవేశిస్తారు. అక్కడున్న వాళ్ళంతా లేచి నిలుచుంటారు జీవానందుడు నాట్య మందిరపు మెట్లమీద కూచోబోతారు. ఇంతలో అందరూ 'ఆసనం – ఆసనం తీసుకునిరాండి' అంటారు.]

జీవా:– [కూచుని] ఆసనం అవుసరంలేదు. దేవాలయంకదూ! ఇక్కడ ఎక్కడచూచినా, ఆసనాలు పరిచేవున్నయ్.

జనా:– ఇందులో సందేహ మేముంది? ఇదే తమరనవలసిన మాట!

[ప్రఫుల్లుడు ఒకప్రక్కగా కూచుని చేతిలోని పత్రిక తిరగవేస్తుంటాడు]

శిరో:– "యాదృశీభావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ" మేఘం నీరుకోరుతుంది. ఇవాళ మధ్యాహ్నం మేమంతా ప్రభువులగారివద్దకు రావాలనుకున్నాం. కాని, ప్రభువు గారి నిద్రకు భంగం కలుగుతుందని...

జీవా:– రాలేకపోయారు? కాని ప్రభువుగారు పగలు నిద్రించరు.

శిరో:– కాని మేమంతా వినడం —

జీవా:– వింటారు! మీరు నిజంకాని విషయాలు చాలా వింటారు. చాలాసంగతులు అబద్ధం చెప్తుంటారు. అంటే – నాకూ – భైరవికీ సంబంధం... [నవ్వుతాడు. వింటున్నవాళ్ళంతా వులికిపడతారు.]

జనా:– గుడివిషయం యింత తొందరగా సమసిపోతుందని

నేననుకోలేదు. నిర్మలునిది దొంకతరుగుడు వ్యవ
హారం...

జీవా:- ఆయన దారికేలా రాగలిగారు ?

శిరో:- [సంతోషంతో. గర్వంతో] అంతా ఆ చండీమాత
దయ. దారికి వచ్చితీరాలి. పాపభారం ఆమె యిక
సహించలేదు.

జీవా:- బహుశా అంతేనేమో ! ఆ తరువాత ?

శిరో:- కానీ, పాపం దూరమైపోయింది. చెప్పు జనార్ధన్.
ప్రభువుగారికి అంతా విప్పి చెప్పు ?

జనా:- [త్రుళ్ళిపడి] మేమంతాకలిసి గుడితాళాలు తారా
దాసు కిప్పించాము. ఇవాళ ఆయనే గుడితలుపులు
తెరిచారు. కాని, పెట్టెతాళాలుమాత్రం షోడశి తను
కిచ్చిందని విన్నాను.

జీవా:- అవును యిచ్చింది. పైఖాతా పుస్తకంకూడా ఇచ్చింది.

శిరో:- ఆమె యింకా యిక్కడేవుంది. ఎప్పుడు వెళుతుందో
ఏమో తెలియదు.

జీవా:- [ఒక్కక్షణం శిరోమణి ముఖంలోకి చూసి] కాని,
మీకెందుకంత హడావిడి ? ఆమెను వెళ్ళగొట్టడం
కూడా అవుసరమేనా ? ఏమంటారు రాయ్‌గారూ ?

జనా:- దస్తావేజులూ, విలువగల వస్తువులూ, దేవి అలంకా
రాలన్నీ ఆ పెట్టెలోవున్నట్లు గ్రామస్తు లందరికీ
తెలుసు షోడశి వెళ్ళిపోకముందే వాటిని సరిచూచు
కుంటే బావుంటుందని శిరోమణి గారంటున్నారు.
బహుశా —.

జీవా:- ఉండవేమో! అంతేకదూ? ఉండకుంటే మీరెలా వసూలు చేయగలరు?

జనా:- [జవాబుగానక] ఏది ఏమైనా తెలుసుకోవాలిగా!

జీవా:- తెలుసుకున్నామనుకోండి! తెలుసుకున్నంతమాత్రా నలాభమేమిటి?

శిరో:- [ఒక పెద్దమనిషితో] చూడు! ఎలా తిరిగిందో వ్యవహారం?

జీవా:- ఎవ్వరైనా చూడవలసిందే కదండీ! అవును. కాని, నాకివాళ తీరుబడిలేదు రాయ్‌గారూ!

శిరో:- మాకు తీరుబడి వుంది ప్రభూ! తాళాలు జనార్దనుని చేతికి యివ్వండి! ఒక్కసారి మేమంతా చూస్తాము. ప్రభువుగారికికూడా జవాబుదారనేది వుండదు. ఏమి వున్నదో, ఏమిలేనో - ఆమె పారిపోకముందే తెలుసు కోవచ్చు. ఏమంటావు జనార్దన్? మీరంతా ఏమం టారు. బాగుందా లేదా?

[అందరూ అందుకు తలఊపుకవేస్తారు]

జీవా:- [నవ్వి] అంత తొందరేమిటి శిరోమణిగారూ? ఒక వేళ కొన్ని మాయమైపోయినా, ఆ బికారివద్ద ఏమి వసూలుచేయగలరు? ఇవాళ అలావుంచండి! నాకు తీరుబడివున్నప్పుడు మీకు కబురుచేస్తాను.

[మనసులోనే అందరూ కోపావేశం పొందుతారు]

జనా:- [లేచి నిలుచుని] కాని, జవాబుదారనేది ఒకటి...!

జీవా:- నిజమే రాయ్‌గారూ. ఆ జవాబుదారి నామీదనే వుంది.

[అందరూ లేచి నిల్చుంటారు. వెళుతూ జమీందారుకు వినపడకుండా గుసగుస లాడ్తారు.]

శిరో:- [రాయ్‌గారిచేతిని పట్టుకుని] చూశారా రాయ్ గారూ! ఈ త్రాగుబోతు వ్యవహారం చూశావా? మాటలు ఎంతో నిగూఢంగా వున్నయ్. ఎప్పుడూ మత్తులోనే మునిగివుంటాడు. ఎక్కువకాలం బ్రతకడు.

జనా:- ఊఁ! భయపడ్డట్టే జరిగింది.

శిరో:- ఇక అంతా ఆ కల్లుదుకాణానికి ప్రయాణంచేస్తుంది. వెళ్ళిపోతూ ఆ పిల్ల పెద్ద సందిగ్ధంలో పడేసింది.

ఒకపెద్దమనిషి:- ప్రభువుగారు తాళాలు యివ్వరేమో!

శిరో:- ఇప్పుడా? ఈమాట అడిగినట్లయితే, మెడపట్టుకుని సాగ్రాగించి వదిలిపెడతాడు. [అంటుంటే శరీర మంతా రోమాంచిత మవుతుంది. అందరూ వెళ్ళి పోతారు.]

ప్రఫుల్లుడు:- [పత్రిక మీదనుంచి చూపులు మళ్ళించి] అన్న య్యగారూ! మళ్ళీ ఒక కొత్తఆపద కొనితెచ్చుకుం టున్నారేం? తాళాలు వారికి వొప్పగించినట్లయితే సరిపోయేది.

జీవా:- సరిపోదు ప్రఫుల్. అంతటితో తీరిపోతే యిచ్చేవాడ్ని. ఆ తరువాత యింకేవిధమైన దుర్ఘటన జరగకుండా ఆమె తాళాలు నాకు యిచ్చింది.

ప్రఫుల్ల:- పెట్టెలో ఏముంది?

జీవా:- [నవ్వి] ఏమివుందా? ఇవాళ ఉదయమే కాతా

చూచాను. మొహరీలు, రత్నాలు, రూపాయలు, మాణిక్యాలు, రత్నఖచిత కిరీటం, యింకా రకరకాలైన నగలు, దస్తావేజులు - ఇవి గాక, బంగారు వెండి పాత్రలు ఎన్నో వున్నయ్. ఇంత చిన్న దేవతకు యింత సంపద వుంటుందని, నేను కలలోకూడా అనుకోలేదు. దొంగల భయంతో, భైరవినులు, యీసంగతి బయటకు పొక్కనీయు లేదనుకుంటాను.

ప్రఫుల్ల :- [భయపడి] మీరనేది ఏమిటి...? అటువంటి పెట్టె తాళాలు మీచేతికి అందడమే! ఒక్కగాని ఒక్క కొడుకును రాక్షసుని చేతికి వప్పగించినట్లుంది.

జీవా:- నువ్వనేది అబద్ధంకాదు. ఇంతడబ్బు విషయంలో నన్ను నేనే నమ్మలేకుండా వున్నాను. అసలు గమ్మత్తేమంటే తాళాలు నేను అడగలేదు. జనార్దనుని కిమ్మని ఎంతో బలవంతపెట్టాను. కాని, ఆమె వొప్పుకోకుండా నాచేతుల్లోనే పెట్టింది.

ప్రఫుల్ల :- అందుకు కారణం?

జీవా:- అసలే అపనింద వేసివున్నారు. పైగా దొంగతనం నేపంకూడా వేశారంటే ఆమె సహించలేదేమో! వీళ్ళసంగతి ఆమెకు బాగా తెలుసు!

ప్రఫుల్ల :- కాని, ఆమె తమసంగతి తెలుసుకోలేకపోయింది.

జీవా:- [నవ్వుతాడు. ఆనవ్వులో జీవంలేదు.] ఆదోషం ఆమెదికాని, నాదికాదు. ఆమెవిషయంలో నేనెన్ని అపచారాలు చేసినా, ఆమె నాసంగతి తెలుసుకోలేకపోయిందంటే-అందులో నాతప్పులేదు. కాని, ప్రపం

చమే అసలు ఆశ్చర్యమయమైనది అంతకన్నా ఆశ్చర్య పూరమైనది మానవుని మనసు. దానిపుద్దేశ్యాలు ఎవరికీ తెలియవు. ఆమె చెప్పిన యుక్తి యేమిటో తెలుసా? ఆనాటి రాత్రి ఆమె చేతులతో యిచ్చిన విషాన్ని కళ్ళుమూసుకుని త్రాగాను. అదే ఆమె తర్కాలకన్నా గొప్పతర్కం. అదే ఆమెకున్న గొప్ప నమ్మకం. కాని, ఆనాటి రాత్రి అంతకు మించిన వుపాయం నాకేమీ కనిపించలేదు. అసలు అక్కడ 'నా' అనే వారెవరున్నారు-? ఈసంగతి షోడశి మర్చి పోయింది. ఏమాత్రం సంశయంలేకుండా ప్రాణాన్ని సహితం తనచేతుల్లో పెట్టగలిగినవాడ్ని ఎలా నమ్మకుండా వుండాలనే సంగతే ఆమె మనసులో పాతుకుని పోయింది. అంతే-ఉన్నదంతా కళ్ళుమూసుకుని నా చేతుల్లో పెట్టేసింది. ప్రఫుల్లా! ప్రపంచంలో ఒక్కొక్కప్పుడు గొప్ప తెలివిగలవాళ్ళుకూడా, గొప్ప పొరపాట్లు చేస్తుంటారు. లేకుంటే ప్రపంచమంతా నీటిచుక్క దొరకని మరుభూమిలా మారిపోయేది.

ప్రఫుల్ల:- ఆమాట నిజమే అన్నయ్యగారూ! అయితే తొందరగా ఆ కాతాపుస్తకం తగులబెట్టి, తారాదాసును పిల్చి నాలుగు బెదిరించండి. ఆమొహరీలతో సాలోమన్ దొరగారి బాకీ తీర్చారంటే ఒక్కచుక్కేమిటి జడివాన కురుస్తుంది.

జీవా:- ప్రఫుల్లా, అందుకనే నేనునిన్నింతగా ప్రేమిస్తుంటాను.

ప్రఫుల్ల:- [చేతులు జోడించి] ఈప్రేమను కొంచెం తగ్గిం

చాలి అన్నయ్యగారూ! మీ రసప్రవాహం ఎప్పుడూ తరిగిపోయేది కాదు. మీ వెంట వుండి, మిమ్మల్ని సంతోషపరుస్తూంటే, యీ బానిస కంఠనాళం ఎండి కట్టయిపోయింది. ఇక బైటకు వెళ్ళి, ఏదోయింత తిండి తిప్పలు చూచుకోవాలి. మీకు రేపు ఎల్లుండిలో సెలవు పుచ్చుకుంటాను.

జీవా:- [నవ్వి] ఒక్కసారే పుచ్చుకుంటావా? కాని, దీనితో ఎన్నిమార్లు పుచ్చుకున్నావు-?

ప్రఫుల్ల:- నాలుగుమార్లు. [నవ్వి] భగవంతుడు నోరసేది యిచ్చేటి అంటువట్లు [illegible] ప్రసాదం తింటూ కాలము వెళ్ళబుచ్చాను. మధ్య మధ్యన యిటువంటి మాటలు నోటంటరాకుంటే, పీడి జాతి కూడా పోతుంది. దీనిలో అపరాధమేమీ లేదు. చాలాకాలంనుంచి, మీ ప్రసాదం తిని యీ దేహాన్ని మాంసము - క్రొవ్వుతో నింపాను. నిజమైన రక్తం యిందులో లేదు. ఇవాళ ఒకపని చేదామనుకున్నాను. సాయంకాలం మసకవెలుతుర్లో, రహస్యంగా వెళ్ళి భైరవి రాణివారి పాదధూళి తీసుకుందా మనుకు న్నాను. ఇంతవరకూ మీలాంటివారిచ్చిన మంచీ చెడు వస్తువులను తిన్నాను. అవి సరిగ్గా జీర్ణంకాక యినప గుగ్గిళ్ళలా పోతున్నయ్.

జీవా:- [నవ్వటానికి ప్రయత్నించి.] ఇవాళ నీ మాటలన్నీ అతిశయోక్తులుగా కన్పిస్తున్నయ్ ప్రఫుల్లా!

ప్రఫుల్ల:- [చేతులు జోడించి] అయితే ఆగండి అన్నయ్య

గారూ. నేను పీటని పూర్తి చేసేస్తాను. ఈ విదూషకుని మీ రిస్తానన్న అయిదు వేల రూపాయలను, దయచేసి కొట్టిపార వేయండి. చండీదేవి సంపద చేజిక్కాక మీకు విదూషకులు కరువు వుండరు. అందువల్ల అంతడబ్బు నాకు దానంచేసి, దుర్వినియోగం చేయకండి.

జీవా:- అయితే యీమారు నన్ను నిజంగా వదిలి పెడతా వన్నమాట ?

ప్రఫుల్ల:- ఈ బుద్ధి మారకుండా వుండేట్లు ఆశీర్వదించండి! కానీ, ఆమెగారు ఎప్పుడు వెళ్తుంది.?

జీవా:- తెలియదు.

ప్రఫుల్ల:- ఆమె ఎక్కడికి వెళ్తుంది.?

జీవా:- అదికూడా తెలియదు.

ప్రఫుల్ల:- తెలుసుకున్నా లాభం లేదన్నయ్యగారూ ! అబ్బ! ఆడదేగాని, మగవాణ్ని కూడా మించిపోయింది ఆనాడు మందిరంలో నిల్చుని చూశాను. అరికాలు మొదలు తలవరకూ రాతితో తయారుచేసినట్లుంది. ఏపిడుగుపాటువల్లనో అది పొడి పొడిగా చేయవచ్చు కానీ మీరనుకున్నట్లు మూసలో వేసి కరిగించి, పోత పోయలేరు. మీకు ఆకోరికవుంటే, వదులుకోండి.

జీవా:- [వ్యంగ్యంగా] అయితే ప్రఫుల్లా! ఈ మారుతప్పకుండా వెళతావా ?

ప్రఫుల్ల:- మీలాంటిపెద్దల ఆశీర్వాదముంటే, మనసులోని కోరిక ఎందుకు ఫలించదు.?

జీవా:- ఫలించవచ్చు. సరే, షోడశి నిజంగా వెళ్లిపోతుందనే నువ్వను కుంటున్నావా.?

ప్రఫుల్ల:- అనుకుంటున్నాను. ఎందుకంటే ప్రపంచంలో అందరూ ప్రఫుల్లులు కారు. అవును. సరిగ్గా జ్ఞాపకం వచ్చింది. మీకు ఒక కబురు చెప్పడం మరచిపోయాను. నిన్న రాత్రి నదివేపు షికారుగా వెళ్ళాను. ఫకీరుగారు కనుపించారు. ఒకనాడు మిమ్మల్ని మర్రిచెట్టుమీదున్న గ్రుడ్లగూబను వేటాడ నీయకుండా, తుపాకి లాక్కున్నాడే — ఆయనే - నేను మిలిటరీవాడిలా సలాంచేసి కుశలప్రశ్నలు వేశాను. ఏదో నాలుగు మాటలు చెప్పి, మందులు మాకులు అడిగి తెలుసుకుని, మీవల్ల వాటిని పేటెంటుగాచేసి డబ్బు గడిద్దామనుకున్నాను. కానీ వారు మహాచలాకిగా తప్పించుకుని, భైరవిని కలుసుకునేందుకు వచ్చి వెళుతున్నానని చెప్పాడు. భైరవి అంతా వదిలిపెట్టి వెళ్ళిపోతూందని కూడా చెప్పాడు.

జీవా:- బహుశా ఆయన అలా ఉపదేశించాడేమో ?

ప్రఫుల్ల:- కాదు. ఆయన ఉపదేశానికి విరుద్ధంగా వెళ్తూంది.

జీవా:- అలా అంటూవేం ? పకీరుగారు ఆమెకు గురువని విన్నాను. గురువుగారి ఆజ్ఞను కాదంటుందా ?

ప్రఫుల్ల:- ఈ విషయంలో ఉల్లంఘిస్తుంది.

జీవా:- కాని, అంత వైరాగ్యానికి కారణం ?

ప్రఫుల్ల:- కారణం తనరే ! ఈ సంగతి తమకు చెప్పడం వుచితమో కాదో తెలియదు. ఆమెగారు మిమ్మల్ని

చూసి భయపడుతూందని ఫకీరుగారి అభిప్రాయం. మీతో పోట్లాట వస్తుందేమోనని అనుమానపడుతుందట. లేకపోతే ఆమెకు అపనింద భయంగాని, వూరిపెద్దల భయంగాని లేదు.

[జీవానందుడు కళ్లు పెద్దవిచేసి చూస్తుంటాడు.]

ప్రఫుల్ల:- అన్నయ్యగారూ! భగవంతుడు మీకుకూడా తక్కువబుద్ధి ప్రసాదించలేదు. అయినా - సర్వస్వం అర్పించి ఆమె పొరపాటు చేసిందో - లేక, చేతులు చాపి పుచ్చుకుని మీరే పొరపాటుచేశారో, యీ [illegible] మిగిలింది. ఒకవేళ బ్రతికి వుంటే. యీ కళ్ళతోనే ఒకనాడు చూస్తాను.

[జీవానందుడు మెదలకుండా కూచునివుంటాడు. హఠాత్తుగా నౌకరు విస్కీగ్లాసు తీసుకుని వస్తాడు.]

జీవా:- ఉఫ్...! ఇక్కడకూడానా! వెళ్ళు. తీసుకుని వెళ్ళు. అక్కరలేదు.

ప్రఫుల్ల:- కోపమెందుకు అన్నయ్యగారూ? తమ రెలాచెపితే అలాగే జరుగుతుంది. మరి అవుసరమెప్పుడో చెప్పండి?

[నౌకరు వెళ్ళిపోతాడు.]

ప్రఫుల్ల:- అకస్మాత్తుగా అమృతంమీద అరుచి కలిగిందేం అన్నయ్యా?

జీవా:- [నవ్వి] అరుచికాదు. అయినా యిక త్రాగను.

ప్రఫుల్ల:- [నవ్వి] ఇలా ఎన్నిమార్లు ప్రమాణంచేశారు?

జీవా:- దీని మీమాంసకూడా అలా వుండనీయ్ ప్రఫుల్లా! ఒకవేళ బ్రతికివుంటే యిదికూడా చూస్తావు.

నౌకరు:- [ప్రవేశించి] ఈ పిస్టలు మరిచిపోయి టేబులు మీదనే వదలి పెట్టి వచ్చారు బాబూ.

జీవా:- మరచిపోలేదు వదలి పెట్టివచ్చాను. అయినా ఇక దాని అవసరంలేదు; తీసుకువెళ్ళు.

ప్రఫుల్ల:- చాలా రాత్రయింది. పదకొండు గంటలైంది. ఇంటికి పదండి!

జీవా:- కాదు, ఇంటికికాదు ప్రఫుల్లా! ఇప్పుడు ఒంటరిగా యీ చీకట్లో కొంచంసేపు అటు తిరిగి వస్తాను.

ప్రఫుల్ల:- ఒంటరిగానా? అస్త్రంలేకండానే? వద్దు. వద్దు. అలా వెళ్ళవద్దు అన్నయ్యగారూ! చీకటిరాత్రి, మీకు శత్రువు లున్నారు.- ఎంత వద్దన్నా, రోజూ వెంట వుండే నౌకరునైనా తీసుకుని వెళ్ళండి [నౌకరు చేతిలోని పిస్తోలు తీసుకుని యివ్వబోతాడు.]

జీవా:- [వెనక్కు అడుగువేసి] ఈ జీవితంలో యికదీనిని ముట్టుకోను ప్రఫుల్లా! ఇవాల్టినుంచి నేను వొంటరిగా శత్రువులు లేనట్లుగానే బయులుదేరుతాను. నావల్ల ఎవరికీ, ఏమీభయం వుండదు. ఆ తరువాత ఎలా జరగవలసి వుంటే అలాగే జరుగుతుంది. నేను ఎవరికి ఫిర్యాదు చేయను.

ప్రఫుల్ల:- అకస్మాత్తుగా యివాళ యిలా మారిపోయారేం? మీ సేవకులనైనా తీసుకుని వెళ్ళండి.!

జీవా:- వద్దు. సేవకులూ, సిపాయిలు, అవసరంలేదు. మీరింటికి వెళ్ళండి!

ప్రఫుల్ల:- మీ ఆజ్ఞ ఉల్లంఘించను. మేము వెళుతున్నాం.

మీరుకూడా ఎక్కువ ఆలస్యంచేయకండి ఇదే నా విన్నపము. [నౌకరుతో ప్రఫుల్లుడు వెళ్ళిపోతాడు.]

[జీవానందుడు మెల్లమెల్లగా నాట్యమందిరపు, రెండో భాగానికి చేరుకుంటాడు. ఒక మనిషి స్తంభాని కానుకొని ఏదో పాడుతూవుంటాడు. అతనికి దగ్గరగా నలుగురైదుగురు దుప్పట్లు కప్పుకుని పడుకుని వుంటారు. జీవానందుడు వంగి వాళ్ళను చూసేందుకు ప్రయత్నిస్తుంటాడు.]

జీవా:- ఎవరునువ్వు ?

యాత్రి:- నేనొక యాత్రికుణ్ని బాబూ !

జీవా:- నేను బాబునా-? ఎలా కనిపెట్ట గలిగావు ?

యాత్రి:- అంతమాత్రం గుర్తించలేనా బాబూ? గొప్పవారు తప్ప యింత విలువగల బట్టలు ఎవరు ధరిస్తారు?

జీవా:- ఓ...! అదాసంగతి ! ఎక్కడనుంచి వస్తున్నావు. ఎక్కడి కెళుతున్నావు ? వీళ్ళంతా మీ సహ యాత్రికులా ?

యాత్రి:- మాన్‌భూమిజిల్లానుంచి వస్తున్నానండీ ! పూరీ ధామము వెళతాను. వీళ్ళలో ఒకరిది మోదినీపురం. ఇంకొకరిది ఇంకెక్కడో- ఎక్కడ కెళ్ళేదీ తెలియదు.

జీవా:- ప్రతిరోజూ యిక్కడికెంతమంది వస్తుంటారు? ఇక్కడ వుండేవాళ్ళకు రోజూ రెండు పూటలూ భోజనం దొరుకుతుందా?

యాత్రి:- [సిగ్గుపడి] రెండు పూటలు భోజనమే కాదు బాబూ! నా కాలుకోసుకుని పుండు పడిపోయింది. అందువల్ల

అది నయమయ్యేవరకూ యిక్కడే వుండమని భైరవి తల్లి చెప్పింది.

జీవా:- నిన్ను వద్దనడం లేదు. అలాగే వుండు. ఇక్కడ కావలసినంత చోటుంది.

యాత్రి:- అయినా, భైరవి తల్లి యిక్కడ వుండదని విన్నాను.

జీవా:- అప్పుడే విన్నావా? ఆమె వుండకపోయినా, ఆమె ఆజ్ఞ వుందికదూ? నిన్ను వెళ్ళిపొమ్మని ఎవరనగలరు? ఏవూరు మీది?

యాత్రి:- మావూరు మాన్‌భూమిజిల్లాలో, వంశీతట గ్రామం. మా గ్రామములో కరువు వచ్చి పడింది. ధాన్యం, నీటికి కరువైంది. వైద్యంలేదు. డాక్టర్లులేరు. జమీందారుగారు కలకత్తాలో వుంటున్నారు. మా దుఃఖ గాథ చెప్పుకుని ఏడవడానికి వీలులేదు. అక్కడ వుండి డబ్బు వసూలు చేసేందుకు ఒక్క గుమస్తా మాత్రం వుంటాడు.

[జీవానందుడు వింటూ తలూపుతాడు.]

యాత్రి:- రెండు సంవత్సరాలనుంచీ వర్షాలు లేవు. పొలంలోని పైరంతా మాడిపోయింది. ఏదోవిధంగా సహించి అలాగే వుంటున్నాము. కానీ, [కంఠం రుద్ధమై పోతుంది.]

జీవా:- అందువల్ల అంతా వదిలివేసి తీర్థయాత్రలకు బయలు దేరారన్నమాట.

యాత్రి:- [తలూపి] ఈ ఫాల్గుణంలో నాభార్య చనిపోయింది.

ఒకడి తరువాత ఒకడు వున్న యిద్దరు కొడుకులు కలరావల్ల చనిపోయారు. ఒక్కరికీ మందు యిప్పించ లేక పోయాను బాబుగారు! [కన్నీళ్ళు తుడుచుకుంటాడు. జీవానందుడు కూడా తన కళ్ళు తుడుచుకుంటాడు.] ఇక యిక్కడెందుకని మనసులో అనుకున్నాను. ఉన్న పూరిల్లు విధవ మేనకోడలికి యిచ్చి బయలుదేరాను. బాబుగారూ, నన్ను మించిన దుఃఖజీవి ప్రపంచంలో యింకొకరు లేరు.

జీవా:- అరే తమ్ముడూ! ఈ ప్రపంచం విశాలమైనది. దీనిలో ఎవరెక్కడ ఏస్థితిలో వున్నారో చెప్పలేము.

యాత్రి:- కాని, నాబోటి......!

జీవా:- దుఃఖజీవి లేడంటావు-? కాని, దుఃఖజీవులకు వేరే జాతంటూ లేదు. దాన్ని బంధించే విధానంకూడా లేదు. అలా వున్నట్లయితే దాన్నుంచి అందరూ తప్పుకుని తిరగవచ్చు. చటుక్కున అది వచ్చి నెత్తిన పడినప్పుడే, మనిషికి దానిసంగతి తెలుస్తుంది. నా మాటలన్నీ నీకు అర్దంకావు తమ్ముడూ. కాని, ప్రపంచంలో నువ్వొక్కడివే కాదు. ఇంకొక దుఃఖజీవి నీ సమీపానే వున్నాడు. అతన్ని నువ్వు గుర్తించలేవు. నువ్వు యిప్పుడే అమ్మగారి పేరెత్తావో—[హఠాత్తుగా సాగరుడు హరిహరుడు వచ్చి ఆలయాని కెదురుగా నిలుచుంటారు. జీవానందుడు వారి సంభాషణ వింటుంటాడు]

హరిహర్:- మన అమ్మగారిని ఎవరైతే సర్వనాశనం చేశారో వాళ్ళను నాశనంచేయకుండా నేను వుండలేను.

సాగర్:- అమ్మవారి గుమ్మంపట్టుకుని ప్రతిజ్ఞ చేస్తున్నాను చిన్నాయనా-! ఉరికంబం ఎక్కవలసివచ్చినా భయ పడను.

హరిహర్:- హుం. ఇప్పుడిక మనకు జెయిళ్ళున్నాయా -? మనకు ఉరివుందా-? ముందు అమ్మగారిని వెళ్లనియ్.

సాగర్ } జై మాతాచండీకి జై. [ఇద్దరూ వెళ్ళిపోతారు]
హరిహర్ }

జీవా:- వాస్తవానికి, దేవతలలాంటి సహృదయశ్రోతలు ఎవ రున్నారు. ఈ గర్వం నిష్ప్రయోజనమైనది కావచ్చు. అయినా, దీనికి విలువ వుంది. అయినప్పటికీ దుర్బలుని వ్యర్థపౌరుషానికి గౌరవం లేదు.

యాత్రీకుడు:- ఏమంటున్నారు బాబూ-?

జీవా:- ఏమీలేదు. నువ్వు దేవిపేరు జపిస్తున్నావు. నేను వచ్చి విఘ్నం కలిగించాను. నేను వెళుతున్నాను. నువ్వు మళ్ళీ ప్రార్థించుకుంటూండు. బహుశా రేపు యీ వేళప్పుడే కలుసుకుంటాను.

యాత్రీకుడు:- రేపు కలుసుకోలేను బాబుగారూ! అయిదు రోజులనుంచీ యిక్కడే వున్నాను. రేపుదయమే వెళ్ళిపోవాలి.

జీవా:- వెళ్ళిపోవాలా-? నీ కాలి గాయం మానలేదని యిప్పుడేగా అన్నావు-?

యాత్రీ:- ఈ దేవాలయం యిప్పుడు జమీందారుగారి

చేతుల్లోకి వెళ్ళింది. మూడురోజులకు మించి ఎవరూ ఉండ కూడదని జమీందారువారి ఆజ్ఞ.

జీవా:- [నవ్వి] భైరవి యింకా వెళ్ళనేలేదు. అప్పుడే రాజా వారి ఆజ్ఞ అమలు జేశారా-? అయితే చండీమాత అదృష్టం మంచిదన్నమాట-! సరే, ఇవాళ అతిధులకు సత్కార్యం ఎలా జరిగింది ఏం తిన్నావు-?

యాత్రీకుడు:- మూడురోజులకు మించనివాళ్ళందరికీ ప్రసాదం లభించింది.

జీవా:- మరి నీకో-? నువ్వువచ్చి మూడురోజులకు పైగా అయిందిగా-?

యాత్రీకుడు:- పూజారి ఏంచేస్తాడు బాబూ-? జమీందారు గారి ఆజ్ఞ అలా ఉందాయెను.

జీవా:- కావచ్చు. [నిట్టూర్పు విడచి] రేపు మళ్ళీ వస్తాను. కాని, నువ్వుమాత్రం మెదలకండా వెళ్ళిపోవద్దు.

యాత్రీకుడు:- మరి పూజారి ఏమన్నా అంటేనో-?

జీవా:- అననియ్ ! ఇంతదుఃఖం సహించినవాడివి, పూజారి అనేమాటల్ని సహించలేవా ? చాలా రాత్రి గడిచింది. నేను వెళుతున్నాను, జ్ఞాపకం వుంచుకో !

[ఇంతలో షోడశి దీపాన్ని పట్టుకుని ఆలయంవేపు వెళుతూ ఉంటుంది]

జీవా:- అలకా-!

షోడశి:- [త్రుళ్ళిపడి] మీరా ? ఇంతరాత్రప్పుడు మీ రిక్కడున్నారేం-?

జీవా:- ఏం తెలుసు...? ఊరికే వచ్చాను. నువ్వు వెళ్ల

ఖోయేముంది దేవిదర్శనంకోసం వచ్చావుగదూ ?
పద, నేను నీవెంబడే వస్తాను.

షోడశి:- నా వెంట రావడంలో ఆపదవుందని మీకు తెలుసు.

జీవా:- ఆపద...? తెలుసు...! కాని, నావల్ల ఎవరికీ ఆపద వుండదు. ఇవాళ నేను ఒంటరిగాణ్ని. నిరాయుధుణ్ణి! ఈ జీవితంలో ఏదీ ఒప్పుకోకపోయినా - ఇకమీద నాకు శత్రువులున్నారనేది ఒప్పుకోను.

షోడశి:- నాతో వచ్చినందువల్ల మీకు లాభమేమిటి ?

జీవా:- ఏమీలేదు. వీలున్నంతవరకు నీవెంట వుంటాను. ఆ తరువాత నిన్ను బండి ఎక్కించి, యింటికి వెళతాను. నీవు వెళ్ళబోతూన్న ఈ సమయాన—నన్ను నమ్ము! నా ఆయువు విలువ నీకు తెలుసు. బహుశా ఇక తిరిగి కలుసుకోలేనేమో ! నీవు నాయందు చూపిన రకరకాల దయలను — నేను అంతిమదినంవరకూ జ్ఞాపకం వుంచుకుంటాను.

షోడశి:- అయితే నావెంట రాండి !

[షోడశి మూసివున్న తలుపువద్దకు వెళ్ళి నమస్కరిస్తుంది]

జీవా:- నీతో నాకు ముఖ్యమైన పనుంది అలకా ! రెండు రోజులుకూడా ఆగలేవా-?

షోడశి:- లేదు—

జీవా:- ఒక్కరోజుకూడా...?

షోడశి:- లేదు—

జీవా:- ఐతే, ఇలా నిలుచునిఉండే నా తప్పులన్నీ క్షమించు.

షోడశి:- ఐనా మీకు దాని అవసర మేముంది-?

జీవా:- ఇవాళ దీనికి జవాబుచెప్పే శక్తి నాలోలేదు. నిన్ను ఒకరోజు పట్టుకుని ఆపుదామనే విషయమే యిప్పుడు నామనసును ముట్టడించివుంది. ఉఫ్...! ఎవరి మనసు పరాయివాళ్ల చేతుల్లో పడుతుందో—ప్రపంచంలో వారిని మించిన అసహాయ్యులూ — నిరపాయులు బహుశా ఎవరూ వుండరనుకుంటాను.

[షోడశి జీవానందుని ముందుకు వచ్చి నిశ్శబ్దంగా నిలుచుని వుంటుంది.]

జీవా:- [లేచి నిలుచుని] నేను నిన్ను శిక్షించానవా, దాన్ని నువ్వు సహించి వెళ్ళిపోయావని అంతా అనుకుంటా రనేదే నాకు పెద్దవిచారం అలకా! ఇంత గొప్ప అబద్ధమైన కళంకాన్ని నే నెలా సహించగలను? ఒక్క రోజు...ఒకే ఒకరోజు...నువ్వు నాదగ్గరుంటే నా నదంతా ఇది సహించగలను.

షోడశి:- [వెనక్కు తగ్గి] చౌదరిగారూ! ఎందుకింత అనునయ వినయం చేస్తున్నారు. ఇప్పటికీ మీ సిపాయిలూ - నౌకర్ల దేహాలలో బలం లేకపోలేదు. నేను ఎవరికీ ఫిర్యాదు చేయనని మీకు తెలుసు...!

జీవా:- [దారి వదిలి] ఐతే నువ్వు వెళ్ళు! అసంభవమైన కోర్కెలతో నేను నిన్నిక సతాయించను. సిపాయిలూ - నౌకర్లూ అంతా వున్నారు అలకా! వారి దేహంలో బలానికి కొరతలేదు ఐన స్వయంగా పట్టు కొనలేకపోయి - బలవంతంగా పట్టించి - బంధించి

వుంచి – ఆ బరువును మోసే బలం యిప్పుడు నా
దేహంలో లేదు.

షోడశి:– [మోకాళ్ళమీద కూర్చుని – భూమికి తల ఆన్చి
నమస్కరించి, పాదధూళి తలమీద పెట్టుకుని] నేను
మీకు ఒక ఆటంకము...

జీవా:– ఏమి టా ఆటంకము అలకా?

[బయట ఎడ్లబండి వచ్చి నిలుచున్న ధ్వని వినిపిస్తుంది.]

షోడశి:– దయవుంచి సావధానంగా వుండండి!

జీవా:– సావధానంగానే వుంటాను. ఐనా యిప్పుడలా వుండ
గలనో లేదో ఏమి తెలుస్తుంది? ఇంతకుముందే ఇద్దరు
మనుష్యులు దేవి గడపను ముట్టుకొని 'తమ తల్లిని
సర్వనాశనం చేసినవారిని తప్పకుండా సర్వనాశనం
చేసితీరుతామని' ప్రతిజ్ఞ చేసి వెళ్ళారు. చాటుగా
వుండి నేనీ చెవులతో విన్నాను. రెండురోజులముందే
అయినట్లయితే – వారిలత్యాల సంగతి తెలుసుకునే
వాడిని. నా విచారానికి అంతుండేదికాదు. కాని –
ఇవాళ ఏమీ తెలియ...ఏమిటి అలకా? ఎందుకలా
త్రుళ్ళిపడ్డావు...?

షోడశి:– [తెల్లబడిపోయిన ముఖంతో] లేదు...ఏమీ లేదు.
ఇప్పుడు మీరు చండీగడం వదలి ఇంటికి వెళ్ళడమే
మంచిది. ఇక్కడ మీ కింకేమీ పని లేదుకదా–?

జీవా:– [అన్యమనసుతో] పని లేదా...?

షోడశి:– ఎక్కడ...? నాకేమీ కనుపించడం లేదు. ఈ
గ్రామము మీది. దీనిపాపాలు పారద్రోలాలని మీరు

వచ్చారు. నాబోటి నీతిమాలి, సిగ్గెగ్గులు లేనిదాన్ని పంపించివేశాక, యిక్కడ మీకేమి వనుందో నాకు తెలియదా.

జీవా:- [కళ్ళు తెరచిచూస్తూ] ఐనా - నువ్వు నీతిమాలిన దానివి కాదుగా...?

[బండివాడు ప్రవేశిస్తాడు]

బండివాడు:- అమ్మగారూ! ఇంకా ఆలస్యముందా-?

షోడశి:- లేదు తమ్ముడూ! ఆట్టే ఆలస్యం లేదు.

[బండివాడు వెళ్ళిపోతాడు]

షోడశి:- చండీగడంనుంచి మీరు తప్పకుండా వెళ్ళిపోవాలి.

జీవా: ఎక్కడికి వెళ్ళమంటావు...?

షోడశి:- ఏం...మీ యింటికి...!

జీవా:- మంచిది. వెళతాను.

షోడశి:- కాని రేపే వెళ్ళాలి.

జీవా:- [ముఖం పైకెత్తి] రేపేనా-? కాని వనుందిగా...? పొలాలకు నీరు నిలవచేయడానికి, దొరువు ఒకటి త్రవ్వించాలి-వీళ్ళ భూములు వీళ్ళకు సరిగ్గా పంచి పెట్టమని నువ్వే ఆజ్ఞాపించావు. అంతేకాకుండా దేవాలయం విషయంలో కొన్ని యేర్పాట్లు చేయాలి. అతిథులు - యాత్రీకులు వస్తుంటారు. వాళ్ళమీద అత్యాచారాలు జరక్కుండా చూడాలి ఇవన్నీ సరి చేయనిదే, వెళ్ళమని నువ్వు చెప్పగలవా-?

షోడశి:- [సంకటంలో చిక్కుకుని] మీకున్న యీ సాధు - సంకల్పాలన్నీ రేపటి ఉదయంవరకూ మీలో

వుంటాయా–? [జీవానందుడు మాట్లాడడు కాని – అవుసరంకన్నా ఒక్కరోజు కూడా అదనంగా వుండనని నాకు మాటయివ్వండి! ఈ రోజుల్లో కూడా యిది వరకటిలానే సావధానంగా వుండాలి... చెప్పండి.—

జీవా:– [ఈ మాటమీద ధ్యానసవుంచకుండా] నేను చేసిన కర్మఫలం, ఒకవేళ నేను అనుభవించినట్లయితే – ఎవరికి ఫిర్యాదుచేయగలను-? కాని – నీవు వెళ్ళబో తూన్న యీ సమయంలో నా కోరిక ఒకటి నెర వేర్చు. [జేబులోంచి ఒక కాగితాన్ని తీసి షోడశిచేతిలో పెట్టి] ఈ ఉత్తరం ఫకీరుసాహెబుగారి కివ్వు-!

షోడశి:– ఇస్తాను. కాని-యీ వుత్తరాన్ని నేను చదువలేనా?

జీవా:– చదువగలవు. కాని అవుసరంలేదు. దీనికి జవాబుకూడా అవుసరంలేదు. నన్ను దుఃఖాలనుంచి రక్షించేందుకు నాకంటే ఎక్కువగా దుఃఖాలు అనుభవించావు. లేకుంటే, నన్నీవిధంగా ... ఆ మాటలు యివ్వ డెందుకు–? నా ఆఖరి ఆటంకం యిందులో వుంది. దాన్ని ఒకవేళ మన్నించినట్లయితే అంతకుమించిన ఆనందం యింకొకటి లేదు.

షోడశి:– ఐతే చదవనా–?

[షోడశి మొదలకుండా ఉత్తరం చదువుతుంది. ఆమె ముఖంలో గొప్పపరివర్తనం కనిపిస్తుంది. జీవానందుడు ఆమెకు తెలియకుండా కన్నీళ్ళు తుడుచుకుంటాడు.]

షోడశి:– నేను కుష్ఠాశ్రమ దాసిగా పోతున్నాననేసంగతి మీా కెలా తెలిసింది–?

జీవా: కుష్ఠాశ్రమంసంగతి చాలామందికి తెలును. ఇక నీసంగ [illegible]...! ఇవాళ దేవిగడపముందు నిలుచుని ఎవరైతే ప్రతిజ్ఞచేసి వెళ్ళారో నా చెవులతో విని కూడా నేను ఎవరినైతే - గుర్తించలేకపోయానో - [illegible] గుర్తించగలగాను-!

షోడశి!- మీకిప్పుడు ప్రపంచవ్యవహారాల్లో మనసు వుండడం లేదా-? ఉన్నదంతా పంచిపెట్టి, సన్యాసిగా మారా లనుకుంటున్నారా-?

జీవా:- [ఉత్తేజితుడై] నేను సన్యాసినవుతానా-! అబద్ధం! నేను బ్రతకాలనుకుంటున్నాను. మానవులకు మధ్యలో మానవునిగా బ్రతకాలనుకుంటున్నాను. ఇల్లు కావాలి. సంసారం కావాలి. భార్య కావాలి. సంతానం కావాలి. మృత్యువు వద్దన్నా వచ్చి పడి నప్పుడు-వారి కళ్ళెదుటనే లేచి పోవాలనుకుంటు న్నాను. ఐనా...ఎవరిముందీ ప్రార్థన...?

[బండివాడు ప్రవేశిస్తాడు]

బండివాడు:- అమ్మగారూ! శైవాలదిగ్ధి ఏడెనిమిది కోసుల దూరం వుంది. ఇప్పుడే బయలుదేరకుంటే ఆలస్య మవుతుంది.

షోడశి:- పదనాయనా, వస్తున్నాను పద-!

[బండివాడు వెళ్ళిపోతాడు. షోడశి జీవానందునికి తిరిగి నమస్కారం చేస్తుంది]

షోడశి:- నేను వెళుతున్నాను.

జీవా:- ఇప్పుడేనా...! ఇంతరాత్రప్పుడా?

షోడశి:- నేను తెల్లవారుజామునే బయలుదేరుతానని రైతులకు తెలుసు! వాళ్ళంతా రాకముందే నేను వెళ్ళిపోవాలి. [వెళ్ళిపోతుంది]

జీవా:- [ఒంటరిగా చీకటిలో నిలుచుని] అలకా! అలకా! ఒకనాడు మీ అమ్మ నిన్ను నాచేతుల్లో పెట్టింది. ఐనప్పటికికూడా నేను నిన్ను పొందలేకపోయాను. ఏలా ఆ [illegible] నన్నెవరైనా - నీ చేతుల్లో పెట్టివుంటే, యివాళ బహుశా నన్ను చీకట్లో ఒంటరిగా విడిచి వెళ్ళేదానివికాదు...

[బయట బండి వెళుతున్న ధ్వని వినిపిస్తూవుంటుంది,]

## నా లు గో అం క ము

### మొదటిదృశ్యము - శాంతికుంజము

[జమీందారు 'శాంతికుంజం' తగలడి, బూడిదగా మారి మూడు నాలుగు రోజులైవుంటుంది. భయంకరమైన అగ్నికాండలోని అనేకచిహ్నాలు యిప్పటికీ వున్నవి. అంతా కాలిపోయింది. కాని, నౌకరులుండే ఒకటి రెండు గదులు మాత్రం మిగిలినవి. వాటిలోనే జీవానందుడు వుంటున్నాడు. బారుయీనది ప్రవహించిపోతూండడం ఎదురుగా తెరిచివున్న కిటికీలోంచి కనపడుతూంటుంది. ప్రాతఃకాల సమయంలో - అలాగే కళ్ళువిప్పిచూస్తూ జీవానందుడు మెదలకుండాకూచుని వున్నాడు. ముఖంమీద చంచలతగాని, ఉత్తేజచిహ్నాలుకాని లేవు. రాత్రంతా జబ్బువల్లపడిన బాధ తాలూకు వాడిపోయిన ఛాయలుమాత్రం శరీరమంతా వ్యాపించివున్నవి.

[ప్రఫుల్లుడు ప్రవేశిస్తాడు]

ప్రఫుల్లు:- ఇప్పుడెలా వుందన్నయ్యా ?

జీవా:- బాగానే వుంది.

ప్రఫుల్లు:- చాలాకాలంనుంచీ వస్తున్న అలవాటు ! మందను కుని ఒక బౌన్సు...!

జీవా:- [నవ్వి] మందుమాత్రం కాదుగా ! కాదు. ప్రఫుల్ నేను సారాయి త్రాగను.

ప్రఫుల్ల:- రాత్రి మేమెంత భయంతో గడిపామో నీకు తెలియదు. మీ చేతులూ - కాళ్ళూ చల్లబడి పోయినయ్ ?

జీవా:- అందుకని వేడి చేయమంటావు.

ప్రఫుల్ల:- వల్లభ డాక్టరుకూడా హఠాత్తుగా హార్టు ఫేలవు తుందేమోనని భయపడ్డాడు.

జీవా:- హార్టు హఠాత్తుగానే ఫేలవుతుంది ప్రఫుల్.

ప్రఫుల్ల:- కాని - అందుకని...

జీవా:- [తన హార్టును చేతితో చూపుతూ] తమ్ముడూ ! ఇది పాపం ఎన్నో ఉపద్రవాల తరువాతకూడా సమానం గానే నడుస్తూంది. కాని ఎన్నడూ ఫేలవలేదు. అకస్మాత్తుగా ఏనాడన్నా - ఒకవేళ ఏ నష్టం కలుగ చేసినా - దీన్ని క్షమించవలసిందే !

ప్రఫుల్ల:- మీరెంత మొండివారు అన్నయ్యా ! ఇంత గొప్ప మొండితనం యింతకాలం ఎక్కడ దాచుకున్నారు ?

జీవా:- ఆఁ, సరిగ్గా సమయానికి జ్ఞాపకం వచ్చింది. నీ లిఁడి తిప్పలు చూచుకునే విషయ మెంతవరకు వచ్చింది.

ప్రఫుల్ల:- తప్పైపోయింది అన్నగారూ! మీకు నయమవనీయండి!
ఆ తరువాత నా తిండితిప్పల విషయం ఆలోచిస్తాను.

జీవా:- నాకు నయమయ్యాకనా? సరే! నేను నిశ్చింతగా వుంటాను.

[తారాదాసు - పూజారి ప్రవేశిస్తారు]

తారా:- దేవాలయంలో కొన్ని పళ్ళాలు - గ్లాసులు కనిపించడంలేదు.

జీవా:- కనిపించనివాటిని కొనడం మంచిది.

[హస్తవ్యస్తంగా నంది ప్రవేశిస్తాడు]

నంది:- [గట్టిగా] ఈ పనిచేసింది సర్దారే! ఇవాళే కబురు తెలిసింది. ఆనాటిరాత్రి వాడూ-వాడి స్నేహితుడూ చాలా ప్రొద్దుపోయేవరకూ యీ చుట్టుప్రక్కల తిరుగుతుండడం చాలామంది చూశారు. ఠాణాకు కబురుపంపాను. పోలీసులుకూడా బయలుదేరి వుండవచ్చు. భూమిజ వంశస్థుల సందర్శి నేను అండమాన్‌కు పంపకుంటే, నందినికాను పైగా యింతకాలంనుంచీ, ప్రభువుల కొలువులో వుండడంకూడా - వ్యర్థమే!

జీవా:- [కొంచం నవ్వి] అటువంటప్పుడు వాళ్ళతోపాటు నువ్వుకూడా వెళ్ళవలసి వస్తుంది! జమీందారుగారి గుమాస్తాగిరిలో నువ్వెంతమంది యిళ్లు తగలబెట్టించావో నాకు తెలుసు. వాళ్ళు నిప్పు పెడుతుండగా చూశినవాళ్ళెవరూలేరు. ఒక్క సందేహంమీద వాళ్లు శిక్ష అనుభవించవలసినప్పుడు తెలిసివున్న అపరాధం

మీద నువ్వూ ఆ శిక్షలో భాగం పంచుకోవలసి వస్తుంది.

నంది:- [మొదట హతబుద్ధులా మారి ఆ తరువాత లేనినవ్వు తెచ్చుకుని] ప్రభువులే తలితండ్రులు. మేము ఏడు తరాలనుంచి ప్రభువులకు బానిసలం! ప్రభువుల ఆజ్ఞ వుంటే, జైలేమిటి ఉరిత్రాడు తగిలించుకున్నా—మాకు గౌరవమే!

జీవా:- కాలిపోయింది తిరిగిరాదు. ఐనా—దానిమీద పోలీసులతో కలసి ఒక కొత్త వివాదం నిలబెట్టి ఏదో కొంత పై వ్యాపారం చేయాలనుకుంటేమాత్రం — ప్రభువులకు చాలా నష్టం కలుగచేసిన వాడివవుతావు నందీ.

పూజారి:- ప్రభువులకు ఫిర్యాదు చేయాలని, మేస్త్రీవచ్చారు బాబూ!

జీవా:- ఏ విషయంలో...?

పూజారి:- సంయోగ వశంచేత, దేవాలయ మరామత్తులో అతనికి చాలా నష్టం కలిగింది. పనిపూర్తయాక, అతని నష్టం పూర్తిచేస్తానని అమ్మగారు చెప్పినప్పుడు నేనుకూడా దగ్గరేవున్నాను బాబూ!

జీవా:- అయితే - ఎందుకు ఇవ్వకూడదు.

పూజారి:- [తారాదాసును చూపించి] చెప్పినవారిదగ్గరకే వెళ్ళి తీసుకోమని వీరు అంటున్నారు.

[జీవానందుడు కోపంతో తారాదాసువేపు చూస్తాడు]

తారా:- చాలా రూపాయలు...?

జీవా:- చాలా రూపాయలే యివ్వాలి మహారాజ్!

తారా:- ఖర్చు ఉచితమైనదా-కాదా...?

జీవా:- చూడు తారాదాసూ! ఈ పాడుబుద్ధులన్నీ వదిలిపెట్టు షోడశి విషయాలలో - ఉచితానుచితాలు ఆలోచించే భారం నీమీద లేదు. వెళ్ళి చెప్పినదేదో ముందు చేయ్! [పూజారితో] షో స్త్రీ నిలుచునేవున్నాడా...?

పూజారి:- అవును ప్రభూ!

జీవా:- పద! [illegible] సనే [illegible] తీర్చివేస్తాను.

[జీవానందుడు-ప్రఫుల్లుడు-తారాదాసు- పూజారీలు నిష్క్రమిస్తారు. ఒక్క నందిబాబు మాత్రం వుండిపోతాడు. [శిరోమణి-జనార్దన ప్రవేశిస్తారు.]

జనా:- బాబుగారు ఎక్కడికి వెళ్ళారు.?

నంది:- [కోపంతో] ఎవరికి తెలుసు?

జనా:- ఎవరికి తెలుసేమిటయ్యా? రాణాకు కబురుచేసిన సంగతి వారికి చెప్పావా-?

నంది:- చెప్పగలిగివుంటే మీరే చెప్పండి-?

జనా:- అసలు సంగతేమిటి నందిబాబూ?

నంది:- ఏమిసంగతో ఎవరికి తెలుసు! బుద్ధి సరిగ్గావుండదు... చెప్పినదానికి నిశ్చయంగాని-అనిశ్చయంగానివుండదు. తారాదాసును కొట్టబోయారు. నన్ను జెయిలుకు పంపుతున్నారు.

శిరో:- అధికంగా మద్యపానం చేశాడేమో? ప్రభువుగారు ఇప్పుడే తిరిగివస్తారని అనుకోవచ్చునా-?

నంది:- రాయ్‌గారూ! లేనిపోని సందేహంతో సర్దార్ సాగరుపేరు పోలీసులకు చెప్పకూడదట.

జనా:- లేనిపోని సందేహమేమిటోయ్-? అది ప్రత్యక్ష సత్యమే!

శిరో:- అవును! ఒకరకంగా ప్రత్యక్ష సత్యమే అనుకోవాలి.

నంది:- మంచిదే ! ఒకసారి చెప్పిచూడండి?

జనా:- ఎందుకు చెప్పనోయ్ ? లేకుంటే పరివారసహితంగా మంటలోపడి మలమలమాడి చానమంటారా? షోడశిని తొలగించి పంపించడంలో నేనూ ముఖ్యణ్ణే గదా-?

శిరో:- నా మాటల్లో ఏమాట విన్నారు.

జనా:- ఇంత గొప్ప జమీందారు భవనానికే నిప్పుపెట్టే వాళ్ళు - ఏ పని చేయకుండావుంటారు-?

నంది:- నేనూ అదే ఆలోచిస్తున్నాను.

జనా:- తరువాత ఆలోచన! ఇప్పుడు తొందరగా దీనికేమైనా ఏర్పాటు చెయ్. ఇక్కడవాళ్ళకు ఆశ్రయం దొరికినట్లయితే - మనల్ని కందముక్కల్లా వేయించి తీరుతారు!

శిరో:- ఆ నీచులు గురుశాపంకూడా లెక్కచేయరు. దోపిడి ముండాకొడుకులు కదూ? వీలుగావుంటే బ్రహ్మహత్యకూడా చేస్తారు. [వణుకుతుంటాడు.]

జనా:- ఇంటివిషయం అలా వుంచండి. నాకు ఎన్నో గడ్డివాములు - ఎన్నో ధాన్యపు మేడాలు వున్నయ్. వాటన్నిటికీ ఒకవేళ—

శిరో:- చూడన్నయ్యగారూ! కొంతకాలంపాటు నా శిష్యుల దగ్గరకు వెళ్ళి వద్దామనుకుంటున్నాను.

జనా:— కాని – నాకు శిష్యులు లేరు. ఒక వేళ వున్నా – ఇన్ని ధాన్యపు మేడాలను వదిలి వాళ్ళవద్ద వుండలేను.

శిరో:— కాదు. ఒక వేళ వెళ్ళినా – వాటిని తిరిగి తీసుకుని రాలేము. ప్రస్తుతం శిష్యులమతి – గతులుకూడా అదోకరకంగా మారిపోయినయ్.

నంది:— నాల్గు ప్రక్కలా గట్టి పహారా ఏర్పాటుచేయండి.

జనా:— అలాగే పెట్టాను. కాని, మీకుమాత్రం పహారా తప్పవుందా నందీ ?

నంది:— ఇంకొక మాట విన్నాను. రైతులంతా నిన్న కోర్టుకు వెళ్ళి ఫిర్యాదు చేసివచ్చారు. వాళ్ళ ఏడ్పులన్నీ విన్నాక–అధికారి భూమినిపరీక్షించేందుకు వస్తున్నాడు.

జనా:— ఏమంటున్నావోయ్! చండీగఢంలో వుంటూ జమీందారు నాకు విరుద్ధంగా ఫిర్యాదు...!

శిరో:— నేనీ సమయంలో శిష్యుల ఆహ్వానాన్ని కాదనడం బావుండదనుకుంటాను జనార్దన్.

నంది:— వీళ్ళ మూర చూడండి. జీవితంలో ఎక్కువకాలం కడుపునిండా కూడు దొరకకుండా – చలికాలం రాత్రులు చలికి వణికిపోతూ రాత్రంతా మేలుకుని వుంటూ – చచ్చేరోజున – కుక్కల్లా దిక్కులేని చావు చచ్చేవీళ్ళు...!

జనా:— ఊపుల సమయంలో పిడికెడు ధాన్యంకోసం, మన దర్వాజాలముందు పడిగాపులుపడే—.

నంది:— ఈ నమ్మక ద్రోహులకు కోర్టుకెళ్ళడానికి డబ్బెక్క

ణ్నుంచి వచ్చింది? ఇటువంటి దుర్బుద్ధి మీకెవ్వరు పుట్టించారు?

జనా:- ఒక్క జిల్లాకోర్టే చాలదనీ, నన్నూ - జీవానంద చౌదరినిదాటి సాగరసర్దారు రాలేని హైకోర్టు ఒక టుందని, ఈ వెధవలు తెలుసుకోలేరు.

నంది:- తప్పకుండా! అక్కడ డబ్బుగలవాడిదే దావా...! మీ వద్ద డబ్బువుంది. సామర్ధ్యంవుంది. అల్లుడుగారు బారిష్టరు. ఇంకా ఎంతోమంది - వకీళ్ళు వున్నారు. ఒక వేళ వాళ్ళు దావా వేసినా - మీకు భయము దేనికి...?

జనా:- [విచారంలో] కాదు నందీ! ఒక్క భూమి అమ్మేవిష యమేకాదు. [పొంజ చేసి] యింకా యెన్నో పనులు చేశాము. చట్టాల పుస్తకాల్లో వాటి ఫలం, సహజ సాధారణమైనది కానిదిగా వుంటుంది

నంది:- అది ఎరుగుదును. ఒక వేళ యీ నీచులకు, కలక్టరు గారికి అనుకూలంగా మారిపోయినప్పుడు...

జనా:- చెప్పలేను. ఈ సంగతే మీ యజమానికి చెప్పు ఇక నేను వెళుతున్నాను.

నంది:- మంచిది. ఈ మధ్య నా పనికూడా పూర్తిచేసు కుంటాను.

[శిరోమణీ - నంది - జనార్దనులు వెళ్ళిపోతారు]

[మాట్లాడుకుంటూ - జీవానందుడు - ప్రఫుల్ల ప్రవేశిస్తారు]

జీవా:- కాదు ప్రఫుల్! పొలాలకు నీరు విలవచేసేందుకు

నం తెనకట్టడానికి పన్నుల దివానువద్ద పైకం లేకుంటే-
యిక్కడి యింటి మరమ్మత్తుకూడా ఆపివుంచు.

ప్రఫుల్ల:- మంచిదే! అలాగే వుంచుదాం! కాని తిరిగి మన
వూరికి వెళదాం పదండి!

జీవా:- కాదు.

ప్రఫుల్ల:- కాకేమిటి...? ఈ యింట్లో ఎలా వుంటారు?

జీవా:- ఇప్పుడు ఎలావున్నానో అలాగే! ఇది సహించ
వలసిందే. మనిషి ఎన్నో ఎన్నో సహించవలసివస్తుంది
ప్రఫుల్!

ప్రఫుల్ల:- దానికీ ఒక హద్దనేది వుంది అన్నయ్యగారూ!
మీ ఆరోగ్యం బాగా చెడిపోయింది. వర్షాకాలం
ముందు రాబోతోంది. ఈ విరిగి - పడిపోయేందుకు
సిద్ధంగావున్న యీ యింటో - అనారోగ్యంగావున్న
మీ దేహం తట్టుకొంటుందా? కనుక మీరు
యింటికి పదండి!

జీవా:- [నవ్వి] ఈ శిథిలమైన శరీరస్థితిని గురించి తరువాత
యింకొకనాడు ఆలోచిద్దాం తమ్ముడూ! దివాను
గారికి డబ్బు కావాలని ఒక ఉత్తరం రాయ్? ప్రజలు
సంవత్సరాల తరబడి డబ్బుకడుతూ - చస్తున్నారు.
ఇప్పుడు వాళ్ళను చావునుంచి తప్పించేందుకు యీ
జమీందారు చచ్చిపోయినా మంచిదే!

[హడావిడిగా జనార్దనరాయ్ ప్రవేశిస్తాడు]

జనా: ప్రభువులు స్వయంగా - ఆజ్ఞను జారీచేసి, నా...?

జీవా:- ఏమిటా ఆజ్ఞ రాయ్ గారూ?

జనా:- నా చెఱువు అంచునవున్న ప్రదేశాన్ని, కొంత విషదీసి దేవాలయపు భూమితో కలిపారుగా ?

జీవా:- ఏ ప్రదేశం సంగతి...? ఇరవై సంవత్సరాలక్రితం దేవాలయ గోశాలగావున్న భూమి సంగతేనా ?

జనా:- అదేమిటో - ఎవ్వటిదో - నాకు తెలియదు.

జీవా:- చాలాకాలమైంది కదూ! అందువల్ల మీకు తెలియదు. బహుశా అనేకపనుల్లో మునిగిపోయి మర్చిపోయివుంటారు.

జనా:- [అసహ్యమైన కోపాన్ని అణచుకుంటూ] ఇవన్నీ చేసేముందు, ప్రభువులు నాకు కొంచం కబురుచేసివుంటే బాగుండేది.

జీవా:- రెండు గడియలు, ముందుగానో - వెనకో - యీ కబురు మీకు అందుతుంది. అందుకు మీరేమీ గాబరాపడవలసిన పనిలేదు.

జనా:- ముందుగా తెలిసివుంటే, కోర్టు కెక్కవలసిన అవుసరం వుండేదికాదు.

జీవా:- ఇప్పుడు కోర్టుకు వెళ్ళవలసిన పనిలేదు రాయ్‌గారూ! భైరవిణుల చేతుల్లోని - దేవి ఆస్తి ఎంతో యితరుల చేతిలోనికి పోయింది. ఇప్పు డవన్నీ తిరిగి రాబట్టుకోవాలి.

జనా:- [ లేనినవ్వును తెచ్చుకుని] అంతకన్నా - కావలసినదేముంది ప్రభూ ! ఈ గ్రామగ్రామమే ఒకప్పుడు చండీదేవిదని విన్నాను. కాని-యిప్పుడు...!

జీవా:- జమీందారుగారి పొట్టన బెట్టుకున్నాడు. జరిగిం

దేదో జరిగిపోయింది. మళ్ళీ రాబట్టుకునేందుకు విశ్వ ప్రయత్నం చేయాలి రాయ్‌గారూ! అందుకనే దేవాలయానికి సంబంధించిన దస్తావేజులు – మ్యాపులు అన్నీ కలకత్తాలోని అటర్నీదగ్గరకు పంపించాను. అయినా–నేనువొక్కణ్ణే ఏంచేయగలను? ఈ విషయంలో మీరంతా నాకు సహాయం చేయండి!

జనా:– ఎందుకుచేయము ప్రభూ–? మేమంతా ఎప్పుడూ ప్రభువులసేవకులం కాకుంటే యింకెవరము–?

[జనార్ధనుడు వెళ్ళిపోతాడు. జీవానందుడు సంతోషంగా నవ్వి ఆవేపే చూస్తూ – కొంచెంసేపు చూస్తూ నిలుచుని వుంటాడు]

ప్రఫుల్ల:– అన్నయ్యగారూ! చివరకు మీ రిక్కడ ఓ లంకా కాండ తయారుచేసేట్లున్నారే–?

జీవా:– అలా జరిగితే అదృష్టం తమ్ముడూ. అందుకోసమే ఒకనాడు దేవతలు తపస్సు చేయవలసివచ్చింది.

ప్రఫుల్ల:– దేవతలు చేయగలరు. లంకకు బయటకూచుని తపస్సు చేయడంలో పుణ్యము ఉంది. దుశ్చింతలు కూడ తగ్గుతవి. కాని–లంక లోవల నివశించేవారికి మాత్రం యీ లంకాకాండ అదృష్టవిషయంకాదని చెప్పవచ్చు, వచ్చినప్పటినుంచీ, గ్రామపువారితో తగవులాడుతూనే వున్నారు. ఇది మీ కంతగా గౌరవమైన విషయంకాదు. అంత అవుసరమైనదీ కాదు. ఈమధ్యలో నానా ప్రకారపనులు చేశారు. ఇక శాంతించి యింటికి పదండి!

జీవా:- సమయం వచ్చినప్పుడు వెళతాను.

ప్రఫుల్ల:- అప్పుడే వెళ్ళండి! ఏది ఏమైనా - మీరు వెళ్ళి పోవడానికి, ఒక కాలమంటూ ఏర్పరచుకున్నారు. కాని-నేను వెళ్ళేందుకు సమయం ఎప్పుడు వస్తుందో- దానికి అంతూ - పంతూ లేకుండా వుంది.

[నంది ప్రవేశిస్తాడు]

నంది:- మేస్త్రీ నిలుచుని వున్నాడు. వంతెనపని ఎక్కడ నుంచి ప్రారంభించాలో తెలుసుకోవాలనుకుంటు న్నాడు బాబూ!

జీవా:- పదనోయ్ ప్రఫుల్లా! ఒకసారి అటు పొలాలవేపు వెళ్ళి పని చూసి వద్దాం!

ప్రఫుల్లా: పదండి.

[జీవానందుడు ప్రఫుల్లుని వెంటబెట్టుకుని బయటకు వెళతాడు. రెండో ప్రక్కనుంచి - శిరోమణీ - జనార్ధనరాయ్ ప్రవేశిస్తారు]

జనా:- బాబుగా రెక్కడికి వెళ్లారు నందీ-?

నంది:- మేస్త్రీపని చూడడానికి వెళ్ళారు. పొలాల మధ్యగా వంతెన కడతారు.

జనా:- పిచ్చివాడు...

శిరో:- మద్యపానజుని బుద్ధివికారం...!

నంది:- ఈ శనివారంనాడు కలెక్టరు భూమి సర్వేకు వస్తారట. కాని-యీ నీచులకు-బుద్ధీ-డబ్బూ ఎవరిస్తున్నారో ఏమీ తెలియడంలేదు. కాని - వాళ్ళు జమీందారు

గారిని సాక్ష్యం తీసుకుంటేమాత్రం వారు ఏమీ దాచరు. ఫోర్జరీసంతకం విషయంకూడా దాచరు.

జనా:- [నవ్వి] నా వయసెంతో చెప్పగలవా నందీ-? చండీ గడపు జనార్దనరాయ్‌ని యీ విధంగా మోసగించి చిత్తుచేయలేవు. ఇంకేదైనా ఉపాయం చూడాలి. [క్షణం మౌనంగా నిల్చుని] అయినా ... అవును! కొంచం నీ చేతుల్లో చిక్కుపడ్డాను. అహంకారంతో కొంత పైవ్యాపారం చేసుకునే వీలు నీ చేతుల్లో పడి వుంది. అయినా-ఎంతవరకు వుంటుందో అంతవరకే. చెయ్...

నంది:- మీతో నిజంచెప్తానా రాయ్...!

జనా:- ఓహో! నిజమే చెపుతావు. నంది అబద్ధం ఎప్పుడు చెప్పాడు ? అదికాదు తమ్ముడూ! నాది మహాపోతే నంది[illegible] పోతాగాని [illegible] యిన తన స్వంత భూమి ఎంతపోతుందో తెలుసుకున్నాడా? తెలుసుకో నట్లయితే వేలుపెట్టి చూపించు. ఆ తరువాత నాతో పేచీ పెట్టుకోండి!

నంది:- పోలమూ - పుత్రాసంగతి కాదు రాయ్‌బాబూ! అసలు ఫోర్జరీ దస్తావేజు తయారుచేసినందుకే యింత లంకాకాండ జరుగుతోంది. అడిగినట్లయితే ఆయన అన్నీ చెప్పేస్తారు. ఏమీ దాచరు.

జనా:- దీనికారణం? జెయిలు పంపాలనేకదూ-? కాని - జనార్దనుడు వొంటరిగా ఒక్కడే వెళ్ళడు నందీ.

మహారాణి – విక్టోరియా, యీ ప్రభువులను మినహా యిస్తుందనుకోవద్దు. ఈ సంగతి వారికి చెప్పు.

నంది:– [అభిమాన స్వరంతో] చెప్పాలనుకుంటే మీరే చెప్పండి.

జనా:– చెప్పకుంటే ఏంచేస్తాను. బాగా చెపుతాను. కలెక్టరు గారిముందు వొప్పుకుని సాధుప్ర... మారడం పరిహాసంకాదు. [సౌంజ్ఞ చేసి] అరదండాలు పడతాయ్.

నంది:– ఆవిషయం మీకూ తెలుసు—వారికీ తెలుసు-!

జనా:– మరిమీకో–? శ్రీమాన్ ఒంటికంటినందీ...? ఆ భవనం తగలడిపోయినప్పుడే యిందులో ఏదో భయ సందేహాలు వున్నాయనుకున్నాను. కాని, జనార్దనుడు మెత్తని మట్టివంటివాడనుకోవద్దు. పశ్చాత్తాప పడతావు. నిర్మలుని ఆపివుంచాను. అతనే మీకు బుద్ధి చెపుతాడు.

నంది:– వూరికే మీరు కోపపడుతున్నారు రాయ్‌గారూ! నాకు తెలిసినున్నంతవరకూ మీకు చెప్పాను. నమ్మకంలేకుంటే ప్రభువుగారు ఇక్కడే – సమీపంలో పొలాల్లోవున్నారు. అటువెళుతూ వారిని అడిగి వెళ్ళండి.

జనా:– తప్పకుండా వెళతాను. శిరోమణీ పదవేం ?

శిరో:– పదండి...భయమేముంది ?

[రెండడగులు ముందుకువేసి – హఠాత్తుగా తిరిగి వస్తాడు.]

శిరో:- [నందితో] బహుశా సారాయి ఎక్కువ తాగలేదు కదా...? లేకుంటే...!

నంది:- వాడిప్పుడు సారాయి తాగడంలేదు. హఠాత్తుగా కంఠస్వరాన్ని తగ్గించి] ఐనా, మీరిప్పుడు వెళ్ళవలసిన పనిలేదు. ప్రభువులు స్వయంగా వస్తున్నారు.

[జీవానందుడు - ప్రఫుల్లుడు వాదోపవాదాలు చేసుకుంటూ ప్రవేశిస్తారు.]

జనా:- [దగ్గరకువచ్చి] స్వభావికంగా వ్యాకులవాటుతో] ప్రభూ! అన్నివిషయాలు కొంచం ఆలోచించి చూడండి!

జీవా:- ఏమిటి రాయ్‌గారూ—?

జనా:- పొలం విషయంలో కలెక్టరుగారు స్వయంగా విచారించేందుకు వస్తున్నారు. బలవంతంగా దావా వేయవలసి వస్తుంది. ఐనా - మీరు...

జీవా:- సరే! ఇక ఉపాయమేముంది రాయ్‌గారూ! వారగారు భూమిని వదలనంటున్నారు. వారు చౌకగా కొన్నారు. దావా పడుతుంది. అందువల్ల - వ్యవహారం గెలవడంతప్ప, రైతులకు యింకొకదారి కనుపించడంలేదు.

జనా:- [వ్యాకులపడుతూ] కాని మనకుదారి!

జీవా:- [క్షణం ఆలోచించి] అదీ నిజమే! మన దారికూడా దుర్గమముగానే తోస్తోంది.

జనా:- [ప్రాణాన్ని గుప్పెట పెట్టుకుని] అయితే నంది చెప్పినది నిజమే! కాని ప్రభూ! వారి దుర్గమమేకాదు.

జెయిలుకూడా రుచిచూడవలసి వస్తుంది. కేవలం నే నొక్కడనేకాదు. మీరు కూడా...

జీవా:- [నవ్వి] అందుకుఏంచేయగలం రాయ్‌గారూ! చెట్టును సంతోషంగా పెంచినప్పుడు దాని ఫలంకూడా అనుభ వించవలసి వస్తుంది.

జనా:- [ఛీత్కరించి] ఇతను మనల్ని సర్వనాశనం చేస్తాడు.

నందీ:- [పిచ్చివానిలా- గబాగబా బయటకి వస్తాడు. అతని వెనుక మెదలకుండా నందికూడా జారుకుంటాడు]

[నేపథ్యంలో కలకలం వినిపిస్తుంది.]

జీవా:- [క్షణంసేపు నిశ్చేష్టంగా వుండి] ఆ సెక్కేది ఎవరు ప్రఫుల్-?

ప్రఫుల్:- బహుశా వాట్టి తర్వో కూలీల గుంపనుకుంటాను.

జీవా:- ఒక్కసారి పిలువు. ఇవాళ ఆనకట్టపని ఎంతవరకు వచ్చిందో కనుక్కుందాము?

ప్రఫుల్:- [కొంచె ముందుకువచ్చి] ఏమయ్యోయ్! ఓ సర్దార్! మాట-మాట కొంచెం యిటురా-!

[స్త్రీ-పురుష కూలీలు ప్రవేశిస్తారు.]

సరదార్:- ఏమిటి బాబయ్యా? ఎందుకు పిలిచారు?

జీవా:- మీరంతా ఎక్కడికి వెళుతున్నారు-?

సరదార్:- అన్నం తినడానికి...!

జీవా:- చూడు తమ్ముడూ? మన ఆనకట్ట వర్షాకాలం రాక ముందే తయారుకావాలి.

అందరూ:- [ఒకేస్వరంతో] అంతా ఐపోతుంది. ఐపోతుంది.

మీరా గేమీరా దిగులుపెట్టుకోవద్దు. వస్తాం. [అంతా వెళ్ళిపోతారు]

[నిర్మలుడు ప్రవేశిస్తాడు]

జీవా:– [ఆహ్వానిస్తూ] రాండి... రాండి నిర్మ[illegible]!

నిర్మల్:– [నమస్కరించి] మీతో నాకు కొంచెం పనుంది.

జీవా:– ఇంకొకనాడు – చూడకూడదా–?

నిర్మల్:– కాదు. చాలా అవుసరం!

జీవా:– ఐతే మంచిదే! చెడ్డపనుల భారాన్ని లాగేందుకు ఎవరికి అడ్డంకి కలుగుతుందో–వారి కాలాన్ని నష్టపరచటంవల్ల పని జరగదు.

నిర్మలు:– అందరూ చెడ్డపనులు చేస్తుంటారు. అటువంటప్పుడే. ప్రపంచంలో మనందరి అవుసరం వుంటుంది చౌదరిగారూ!

జీవా:– ఐనా–పని విషయంలో–అందరి అభిప్రాయం ఒకే విధంగా వుండదు నిర్మలబాబూ! రాయ్‌గారితో నేను శత్రుత్వం కోరడంలేదు. మీఉద్దేశ్యం ఫలించినట్లయితే నేను చాలా సంతోషిస్తాను. ఐనా – నేను నా కర్తవ్యాన్ని నిశ్చయించుకున్నాను. అందులో యిక తిరుగుఉండదు.

నిర్మల్:– ఐతే అంతా మీరు వశపర్చుకునేది నిజమేనా?

జీవా:– అవును. నిజమే!

నిర్మల్:– మీ జవాబులకు మీరే శిక్షపడవలసినచ్చో, మిగిలిన వారంతా రక్షింపబడితేనో–?

జీవా:– అవునవును! అలాకూడా జరగవచ్చు. ఐనా అందుకు

నేను చేయగలఫిర్యాదు ఏమీలేదు. నేనుచేసిన కర్మ ఫలాన్ని నేను ఒక్కడినే అనుభవిస్తాను. అదేచాలు. రాయ్‌గారు విడుదలపొంది, పుష్టికరమైన శరీరంతో ప్రపంచ వ్యవహారాల్ని నిర్వహించనీయండి. మా నందిమహాశయుడు కూడా యింకొకచోట గుమస్తాగిరి వెలగబెడుతూ—ఉత్తరోత్తరా వున్నతిని పొందుతూ వుండవచ్చు. ఎవరిమీదా నాకు ఉక్రోషంలేదు.

నిర్మల్:- ఆత్మరక్ష అనేదానికి అందరికీ అధికారంవుంది. అందువల్ల, రాయ్‌గారుకూడా అది చేసుకోవాలి. మీరు చేసుకోవాలి. మీరు జమీందారులు. మీ ఎదుట—దావానుగురించి విస్తరించి చెప్పడం అతిశయోక్తిగా వుంటుంది. బహుశా చివరవరకూ విషానికి, విషముతోనే చికిత్స చేయవలసివస్తుంది.

జీవా:- చికిత్సచేసే వైద్యుడు మోసంచేయాలని, విషంతో హత్యచేయడానికి సిద్ధపడతాడా!

నిర్మల్:- [కోపాన్ని ఆపుకుంటూ] ఎవరికీ ఏమీ నష్టం లేకండాకూడా జరగవచ్చుగా!

జీవా:- [ఆ సమయంలో రాజీపడి] ఒకవేళ మీరలా చేయగలిగితే చాలా మంచిదే; కాని నే నాలోచించినంత వరకు అలా జరగదనుకుంటాను. రైతులు వారి భూమినిమాత్రం వదిలిపెట్టరు ఎందుకంటే, ఒక్క అన్నవస్త్రాల విషయమే కాదిది. వంశపారంపర్యంగా వస్తున్న ఏడుతరాలనాటి పవిత్రమైన భూమితో వారి కున్న సంబంధాన్ని తెంచుకోరు. [కొంచం ఆగి]

రైతుపక్షం ఎంత బలంగలదో మీకు తెలుసు దానిమీద ఎవరూ బలం ప్రయోగించలేరు. బల ప్రయోగం ఒక్క రైతులమీదనే ప్రయోగించాలి. వాళ్ళమీద ఎప్పుడూ అత్యాచారాలు జరుపుతూనే వున్నారు.

నిర్మల్:- మీకు చాలా పెద్ద జమీందారీ వుంది. ఈ కొద్ది మంది రైతులకు — ఎక్కడో — ఒక్కచోట...!

జీవా:-కాదు...కాదు...ఇంకెక్కడా లేదు. ఈ చండీగడం లోనే కావాలి. ఇక్కడే — నేను ఆనాడు వాళ్ళవద్ద నుంచి — ఎంతో డబ్బు గుంజుకున్నాను. అప్పుడు ఆ డబ్బును అప్పుగా రాయ్‌గారు వాళ్ళకుయిచ్చారు. ఈ అప్పు నేను తీర్చవలసివుంది. అంతేకాదు .... ఇంకొక పెద్ద శూలాన్ని వాళ్ళ హృదయాల్లో గుచ్చాను. అది నాకే తెలుసు! కాని ఈ విషయాలు వదిలిపెడదాం! ఈ లేనిపోని కబుర్లు చెప్పే ప్రవృత్తి నాకులేదు. నేను నా మనసును స్థిరపర్చుకున్నాను.

[జీవానందుడు వెళ్ళిపోతాడు]

[అతను వెళ్ళిన వేపు చూస్తూ — నిర్మలుడు అభిభూతుని లా నిల్చునివుంటాడు. ఇంతలో ఫకీరుసాహెబ్ ప్రవేశిస్తాడు]

ఫకీరు:- సలాం అల్లుడుబాబుగారూ! బాబుగా రెక్కడ?

నిర్మల్:- [నమస్కరించి] తెలియదు. ఫకీరుగారూ! షోడశి మా కిప్పుడు చాలా అవుసరం. ఆమె ఎక్కడవున్నా ఒకసారి నేను కలుసుకోవాలి. ఎక్కడ వుందో చెప్పండి.

ఫకీరు:- మీతో చెప్పడానికి నా కేమీ అభ్యంతరంలేదు. ఎందుకంటే, ఒకానొకప్పుడు - చాలామంది, ఆమెను సర్వనాశనం చేయాలని చూసినప్పుడు - మీరొక్కరే ఆమెను రక్షించాలని నిలబడ్డారు.

నిర్మల్:- ఇవాళ అదంతా తారుమారై పోయింది ఫకీరు గారూ! ఇప్పుడు వాళ్లందర్నీ రక్షించాలంటే ఒక్క ఆడదే రక్షించాలి. ఇప్పుడామె ఎక్కడుంది?

ఫకీరు:- శైవాలదిగ్గి కుష్ఠాశ్రమములో!

నిర్మల్:- కుష్ఠాశ్రమములోనా? అక్కడ కులాసాగావుండా?

ఫకీరు:- [నవ్వి] అదేనండీ! ఆడవాళ్ళు సంతోషంగా వుంటా రనేది దేవతలకే తెలియదనుకుంటాను, ఈ ఫకీరు కెలా తెలుస్తుంది? ఐనప్పటికీ మా అమ్మ శాంతిగానే వుందని చెప్పగలను.

నిర్మలు:- [క్షణం మెదలకుండా వుండి] మరి మీ రిక్కడి కెందుకు వచ్చారు?

ఫకీరు:- జమీందారు జీవానందుని ఉత్తరం అందుకుని, వారిని కలుద్దామని వచ్చాను. ఈ వుత్తరం మీరు కూడా చదవతగినదే...ఇదుగో చదవండి! [ఉత్తరం యివ్వబోతాడు]

నిర్మల్:- [సంకోచంతో] జీవానందుడు వ్రాసినదా? దాన్ని నేను ముట్టుకోను. అవుసరంవుంటే మీరే చదవండి!

[ ఫకీరు ఉత్తరాన్ని చదువుతుంటాడు. నిర్మలుని ముఖం, ఆశ్చర్యంతో కఠోరంగా మారుతుంది.]

ఫకీరు:- [ఉత్తరం చదువుతుంటాడు]

ఫకీరుగారూ, షోడశి అసలుపేరు అలక! ఆమె నా భార్య. మీ కుష్ఠాశ్రమ శుభాన్ని నేను కోరుతున్నాను. ఐనా దయవుంచి ఆమెతో నీచపుపనులు చేయించకండి! ఆశ్రమము కట్టిన ప్రదేశం నాదికాదు. ఐనా దాని కానుకునివున్న శైవాల్‌దిగ్గి గ్రామము నాదే! దాని ఆదాయం సంవత్సరానికి అయిదారు వేలుంటుంది. నేను మిమ్మల్నెరుగుదును. ఐనా—మీారు లేనప్పుడు అలక, ఆధారం లేనిదని ఎవరైనా బాధిస్తారనే అనుమానంతో — కుష్ఠాశ్రమానికి ఆ గ్రామాన్ని దానం చేస్తున్నాను. మీారుకూడా ఒకానొకప్పుడు చట్టాల విషయం తెలుసుకున్న జీవులే! అందుకని — యీ దానాన్ని దృఢపరిచేందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయండి! దానికయే ఖర్చు నేనే భరిస్తాను. కాగితాలన్నీ సిద్ధంచేసి పంపించినట్లయితే — నేను దస్కత్తుచేసి రిజిష్టరు చేయిస్తాను.

జీవానందచౌదరి.

ఫకీరు:— [ నిర్మలుని ముఖభావాలు చూచి ] ప్రపంచంలో ఆశ్రితులకు ఒక ఉనికి ఉండికదా—?

నిర్మల్:— [దీర్ఘమైన నిట్టూర్పు విడిచి] అవును! ఐనా ఇది నిజమని నమ్మడానికి సాక్ష్యమేమిటి...?

ఫకీరు:— నిజంకాకుంటే యీ దానాన్ని స్వీకరించేందుకు నేను షోడశిని తీసుకుని వచ్చేవాడినేకాదు.

నిర్మల్:— [ వ్యగ్రకంఠంతో ] కాని — ఆమె వచ్చిందా—? ఎక్కడవుంది—?

ఫకీరు:- నా ఆశ్రమంలో నదికావలి వేపు...!

నిర్మల్:- నేనీ సమయంలో ఆమెదగ్గరకు వెళ్ళడం అవసరం ఫకీరుగారూ !

ఫకీరు:- పదండి. [నవ్వి] కాని-ప్రొద్దుపోయింది. చీకటిలో తిరిగి ఆమె మీా చేతిని పట్టుకొని యింటికి చేర్చవలసి వస్తుందేమో ! [ఇద్దరూ వెళ్ళిపోతారు]

[హఠాత్తుగా తెరవెనుక కొంతమంది కంఠధ్వనులు, కోలాహాలంగా వుంటుంది. ఆ ధ్వనుల్లో ప్రఫుల్లుని కంఠం బాగా వినిపిస్తూఉంటుంది - "జాగ్రత్త...జాగత్త ... దెబ్బ తగలకుండా చూడండి" ఆ మరుక్షణంలో జీవానందున్ని చేతులమీాద మోసుకునివచ్చి పక్కమీాద పడుకోబెడతారు. కళ్ళు మూసుకుని వుంటాడు. దగ్గర్లో ప్రఫుల్లుడు వుంటాడు]

ప్రఫుల్లు:- ఇప్పుడు ఎలావుంది అన్నయ్యా !

జీవా:- బాగాలేదు. నేను స్మృతితప్పి వంతెనమీాదనుంచి పడిపోయూనా ప్రఫుల్-!

ప్రఫుల్ల:- కాదన్నయ్యా ! మేమంతా పట్టుకున్నాము. ఈ బలహీనతలో మీా రెక్కువగా పనిచేయొద్దని నేను మీాతో ఎన్నోమార్లు చెప్పాను. కాని మీారు పెడ చెవిని బెట్టారు. ఇలా సర్వనాశనం చేశారేమిటి... ?

జీవా:- [కళ్ళు తెరచి సర్వనాశనం ఎక్కడైంది ప్రఫుల్ ? ఇదే ఇదే ఆవలివొడ్డు చేరడానికి బారిబత్తైము. ఇంతకు మించిన మూలధనం నావద్ద ఏమివుంది?]

[గబగబా నంది ప్రవేశిస్తాడు. అతనిచేతిలో గాజుసీసా వుంటుంది.]

నంది:- [ప్రఫుల్లనితో] ఇప్పుడు వెంటనే దీన్ని బాబుగారికి త్రాగించండి. వల్లభడాక్టరు పరుగెత్తుకుని వస్తున్నాడు. వచ్చాడే అనుకోండి!

ప్రఫుల్ల:- [ మందుసీసా తీసుకుని జీవానందునిదగ్గరకువచ్చి అన్నయ్యా! ఈ మందు కొంచం తాగు.

జీవా:- [కళ్ళుమూసుకునే] తాగాలా ...? ఇటివ్వు [తాగి] ఎక్కడో శాగా నొప్పిగాఉంది ప్రఫుల్లా! ఈనొప్పికి అంతూ-పంతు లేనట్లుంది. ఉఫ్ ...!

ప్రఫుల్ల:- [వ్యాకులపడుతూ] నందీ! డాక్టరు ఎంతదూరాన వున్నాడో చూడు...కొంచెం పరుగెత్తుకుని వెళ్ళు...

నంది:- పరుగెత్తుకుంటూనే వెళుతున్నాను బాబూ! [గబ గబా వెళ్ళిపోతాడు.]

జీవా:- పరుగెత్తడంవల్ల యిప్పుడేమవుతుంది ప్రఫుల్లా! ఇప్పుడు మీరంతా పరుగెత్తుకునివెళ్ళినా - నన్ను రక్షించలేరు.

ప్రఫుల్ల:- [దగ్గర్లో మోకాళ్ళమీద కూచుని] ఇలా ఎన్నో మార్లు జరిగిందన్నయ్యా! ఇప్పుడిలా ఎందుకు ఆలోచిస్తున్నారు?

జీవా:- ఆలోచిస్తున్నానా...? కాదు ప్రఫుల్లా! ఇక ఆలోచించను. [కొంచంనవ్వి] అనేకమార్లు జబ్బుపడ్డాను- బాగుపడ్డాను. అది నిజమే! ఈ మారు ఏ విధంగా కూడా నయమవదు. ఇదికూడా నిజమే ప్రఫుల్.

[నంది - వల్లభడాక్టరు ప్రవేశిస్తారు.]

ప్రఫుల్ల:- [లేచినిలుచుని] రాండి డాక్టరుగారూ!

వల్లభ:- ప్రభువుగారికి బావుండలేదనివిని పరుగెత్తుకుని వస్తు న్నాను. మందు తాగించారుకదూ ?

నంది:- అవును డాక్టరుగారూ! తాగించాము. మందుసీసాను చేత్తో పట్టుకునే పరుగెత్తుకుని వచ్చాను; కొన్నిచోట్ల పడిపోతూ - పడిపోతూ - నిలదొక్కుకున్నాను.

వల్లభడాక్టరు దగ్గరకువెళ్ళి కూచుంటాడు. కొంచం సేపు నాడిచూచి ముఖాన్ని వికృతంగా చేస్తాడు. ఆ తరువాత తల ఆడించి, ప్రఫుల్లునితో పరిస్థితి బాగుండలేదని సౌంజ్ఞ చేస్తాడు.

నంది:- [వ్యాకులకంఠంతో] ఐతే ఏమవుతుంది డాక్టరు గారూ! ఏదో ఒక గొప్పమందు యివ్వండి. మేము డబుల్ విజిటింగ్ ఫీజ్ యిస్తాము. మీరు కోరినదాన్ని యిస్తాము.

ప్రఫుల్ల:- కోరిన దాన్నేనా యిస్తావా? ఈ కొంచమేనా? అసలే అది ఎంతవుతుంది నందీ! మేము దానికన్నా ఎంతో ఎక్కువ యిస్తాము. నా ప్రాణాల విలువకూడా ఎక్కువవుండదు. ఐనా - వాటిని యివ్వడానికికూడా సిద్ధంగావున్నాను డాక్టరుగారూ !

వల్లభ:- [ముఖాన్ని పైకెత్తి] అంతా వారిచేతుల్లోవుంది. లేకుంటే మనలోఏముంది ? నిమిత్తమాత్రులం. చండీ గఢంలోని వల్లభడాక్టరు చచ్చినవాళ్ళను బ్రతికిస్తా డని లోకులంటారు. మందుపెట్టెను కూడా నావెంటే తీసుకునివచ్చాను. అందులో పొరపాటులేదు. పదండి.

నందిగారూ! తొందరగా ఒక మిక్చరు కలిపిఇస్తాను.

[నంది – వల్లభడాక్టరు వెళ్ళిపోతారు.]

జీవా:– కళ్ళుమూసుకుని పడివుంటే ఎన్నో ఆలోచనలు మనసులో రేగుతూఉన్నాయ్ ప్రఫుల్లా! ఈ ప్రపంచమే ఆశ్చర్యమైన దనిపిస్తోంది. లేకుంటే నాకోసం నువ్వెందుకు కన్నీళ్ళు కార్చాలి?

ప్రఫుల్ల:– మీకు తెలుసు...!

జీవా:– ఎందుకు తెలియదు ప్రఫుల్లా? ఐనా నంది కేమి తెలుసు. తనలానే నువ్వూ ఒక పనివాడివని వాడను కుంటున్నాడు. ఒక ఛండాలుడైన జమీందారుని స్నేహితుడనుకుంటున్నాడు. నాకోసం నువ్వెంత సహించావు? ఎన్నెన్ని చేశావు-? ఈ సంగతులు బయటివాళ్ళ కెలా తెలుసు! మధ్యమధ్యలో అసహ్యం కలిగినప్పుడు – తిండి – తిప్పలకోసం వెళ్ళి పోతావని కూడా అనుకున్నాను. కాని - నేనే వెళ్ళ నీయలేదు. అలా వెళ్ళనీయకపోవడమే మంచిదైంది. ఒకవేళ నిజంగా నన్ను వొదిలిపెట్టి వెళ్ళివుంటే – యివాల్టి యీ గుప్పెడు ప్రాణాన్ని వుంచేందుకు చోటనేది ఎక్కడ దొరికేది-?

ప్రఫుల్ల:– అన్నయ్యా—

జీవా:– కొంచెం కలంకాగితం తీసుకురా ప్రఫుల్! నా తమ్మునికి స్నేహదానం—

ప్రఫుల్ల:– [కాళ్ళవద్ద మోకాళ్ళమీద కూచుని] మీ స్నేహమే నాకు ఎక్కువగా లభించింది అన్నయ్యా

అదే నా ధనం! నా పరిశ్రమవల్ల పొందినదే తప్ప జీవితంలో ఎక్కువ పొందాలనే ఆశ వుండకూడదని ఆశీర్వదించు. నాకదే పదివేలు.

జీవా:- [క్షణంసేపు స్తబ్దుడై] సరే! అలాగేలే ప్రఫుల్! దానం చేసి నిన్ను చిన్నబుచ్చను. ఐనా - నువ్వు ఏనాడు కూడా లోభివికావు.

[వల్లభ డాక్టరు అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా లోపలికివచ్చి - మందుసీసాను ప్రఫుల్లుని చేతిలో పెట్టి అలాగే నెమ్మదిగా బయటికి వెళ్ళిపోతాడు.]

జీవా:- ఎంత భయంకరమైన చీకటి ప్రఫుల్లా? ఎంత రాత్రయింది?

ప్రఫుల్ల:- ఇంకా రాత్రికాలేదు అన్నయ్యా!

జీవా:- రాత్రికాలేదూ? మరటువంటప్పుడు నా కళ్ళముందు యీ కటికి చీకటేమిటి ప్రఫుల్?

ప్రఫుల్:- చీకటి గాదన్నయ్యా! ఇంకా సూర్యుడు అస్తమించలేదు.

జీవా:- సూర్యుడు అస్తమించలేదూ? అస్తమించలేదూ? అయితే - తెరువు... తెరువు ... నా ఎదురుగావున్న కిటికీని తెరువు. ప్రఫుల్లా! ఒక్కసారి ఆయన్ను చూస్తాను. నేను వెళ్ళిపోయేముందు నా ఆఖరి నమస్కారం వారికి అర్పిస్తాను.

[ప్రఫుల్లుడు ఎదురుగావున్న కిటికీని తెరిచి, జీవానందుని దగ్గరకెళ్ళి, ఆయన సౌంజ్ఞచేసినవిధంగా తలక్రింద ఎత్తుపెడతాడు. ఎదురుగా బారుయీనది తాలూకు జల

ధారలు మందగతితో ప్రవహిస్తూవుంది. ఆవలగట్టున సూర్యుడు అస్తోన్ముఖుడవబోతున్నాడు. దూరంగావున్న అడవి అంతా నీలంగావుంది. నదీతటంమీదున్న యిసుక ఉజ్వలంగా ప్రకాశిస్తూంది ]

జీవా:- [కళ్ళు తెరిచి - కంపిస్తున్న చేతుల్ని జోడించి తలపై పెట్టుకుని కొంచంసేపు స్తబ్దంగావుండి] విశ్వదేవా! నువ్వు అపరిచితుడవని ఎవరంటారు? నువ్వు చిర రహస్యాలతో కప్పబడివున్నావని ఎవరనగలరు? జన్మ జన్మాంతర సహస్రపరిచయము - ఇవాళ వెళ్ళిపోతూ నీ ముఖంలో స్పష్టంగా చూడగలుగుతున్నాను. [క్షణంసేపు నీరసంగావుండి] నిన్ను చూస్తే భయం కలుగుతుందనుకున్నాను. బహుశా - ఈ జీవితంలోని, ఎన్నో దుఃఖాలు, దీర్ఘమైవ నల్లని నీడల్లా నిన్నావరించి వేస్తాయేమో ననుకున్నాను. ఐనా అలా కానీయ లేదు బంధూ! ఈ జీవితంలోని శేషనమస్కారాన్ని స్వీకరించు. [ఆయాసంతో ఒకప్రక్కకు వొరిగిపోయి] ఉఫ్...నొప్పి...!

ప్రఫుల్ల:- [వ్యాకులపడుతూ] నొప్పి ఎక్కడ అన్నయ్యా!

జీవా:- ఎక్కడా? తలలో - గుండెల్లో - శరీరమంతటా - ప్రఫుల్లా - ఉఫ్...!

[గబగబా షోడశి ప్రవేశిస్తుంది. ఆమె వెనక, నంది. వల్లభ డాక్టరు వుంటారు.]

షోడశి:- ఏమిటి మీరంటున్నారు ప్రిపుల్ ?

[జీవానందుని కాళ్ళవద్ద కూచుంటుంది.]

షోడశి:- మిమ్మల్ని తీసుకుని వెళ్ళడానికే యివాళ అంతా వదిలిపెట్టివచ్చాను. అయ్యో నిష్ఠూరమా! అభిమానానికింతపనిచేసి వూరుకున్నారేమిటి?

ప్రఫుల్ల:- అన్నయ్యా! కళ్ళు తెరవండి . . . చూడండి . . . అలక వచ్చింది.

జీవా:- అలకా! నువ్వు వచ్చావా? [మెల్లగా తల ఆడించి ఐనా యిప్పుడు సమయంలేదు.

షోడశి:- కాని - ఆనాడు - మీరు మనుష్యుల్లో మనిషిగా వుండాలని కోరుతున్నానని అన్నారుగా! మీకు యిల్లూ వాకిలీ, భార్యా బిడ్డలూ - కావాలనికూడా అన్నారు.

జీవా:- [తలూపి] కాదు. ఇక మోసంచేసి - ఏదీ కోరను అలకా! ఎప్పుడూ మోసం - దగాచేస్తూ - పొందడం చేతనే నా ఉత్సాహం ఎక్కువై పోయింది. అలాగే జరిగిపోతుందనుకున్నాను. ఐనా - ఇవాళ వాటన్నిటికి తపిసీలు యివ్వవలసివచ్చింది. ఏ సౌభాగ్యాన్ని యీ జీవితంలో ఉపార్జించుకోలేకపోయానో అదే ఋణము. ఇక నాకాభారం ఎక్కువకాగూడదని కోరుతున్నాను.

[షోడశి జీవానందుని గుండెలమీద తల ఆనిస్తుంది. మెల్లమెల్లగా తన బలహీనమైన చేతిని ఆమె తలమీద పెడతాడు.]

జీవా:- ఏదో కొంత అభిమానముంది. ఐనప్పటికీకూడా—నేను వెళ్ళిపోకముందే నిన్ను పొందగలిగాను. ఇంతకంటే ఎక్కువ పొందాలంటే లోకానుభవంతో ప్రతిదినపు పనుల్లో - బహుశా ఒకప్పుడు క్షుణ్ణంగా ఒకప్పుడు బలహీనునిగా అయి పోయేవాణ్ణి. కాని యిప్పుడు భయంలేదు! సమాగమము యిక విచ్ఛేదం కాదు. అలకా !ఇదే మంచిది.

[షోడశి మాట్లాడటలేకపోయింది. దుస్సాహసమైన ఆక్రందనా వేగంతో ఆమె వక్షస్థలం పైకి-క్రిందకు ఎగురుతూ వుంటుంది]

జీవా:- ఉఫ్ ! ప్రపంచంలో ఇప్పుడు గాలే లేదా ప్రఫుల్లా ?

ప్రఫుల్ల:- ఎక్కువకష్టంగావుందాన్నయ్యా ? డాక్టరును పిలవనా ?

జీవా:- వద్దు...వద్దు... ఇక డాక్టరు-వైద్యుడు అవుసరంలేదు ప్రఫుల్ ! నువ్వూ—అలకా వున్నారు చాలు. ఉష్ ఎంత అంధకారం-సూర్యుడు అస్తమించాడా ప్రఫుల్?

ప్రఫుల్ల:- ఇప్పుడే అస్తమించబోతున్నాడు.

జీనా:- అందుకే! గాలిలేదు. వెలుతురులేదు విశ్వదేవా! ఈ జీవితంలో శేషదానాన్ని—నిశ్శేషం చేసే పుచ్చుకున్నావా-ఉఫ్...

షోడశి:- పతిదేవా-! స్వామీ!

ప్రఫుల్ల:- ప్రఫుల్లునికి ఇవాళ నిజంగా సెలవు యిప్పించావా అన్నయ్యా-!